

భారత సంస్కృతి-చరిత్ర 47



ముని ఆంతర్యం! (బే.క) 19



యక్షపర్వతం 11



నక్కతీర్పు! 36

## ఈ సంచికలో






SUBSCRIPTION

**For USA and Canada**
**Single copy $2**
**Annual subscription $20**
***Remittances in favour of Chandmama India Ltd.***
to
Subscription Division
CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony
Ekkatuthangal, Chennai - 600 097
E-mail : subscription@chandamama.org

చందా
ఎయిర్ మెయిల్ ద్వారా అన్నిదేశాలకు
పన్నెండు సంచికలు రూ: **900**
ఇండియాలో బుక్‌పోస్ట్‌ద్వారా రూ,120లు
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా
గానీ,మనిఆర్డర్ ద్వారాగానీ
'చందమామ ఇండియా లిమిటెడ్
పేరిట పంపండి':



వ్యవస్థాపకులు
బి.నాగిరెడ్డి - చక్రపాణి

# శాంతి-సామరస్యం!

ఆశలతో, అందమైన కలలతో ఆరంభమైన నవసహస్రాబ్ది నూతన సంవత్సరం ముగుస్తూన్న చివరిదశలో భీకరయుద్ధనాదాలు, ఆక్రందనలు వినిపించడం మొదలయ్యాయి. సెప్టెంబర్‌లో అమెరికాలోని ప్రపంచ వర్తకసంస్థ విధ్వంసం; దాని పర్యవసానంగా అక్టోబర్‌లో ఆఫ్ఘన్‌తీవ్రవాదులపై అమెరికా దాడి ప్రపంచాన్ని కలవరపరచాయి. బయోటెర్రరిజం అనే జీవాస్త్ర తీవ్రవాదం ప్రపంచప్రజలను భయకంపితులనుచేస్తోంది!

కుటుంబంలో జరిగే విషాదఘటన బంధుమిత్రులను ఒకటిగా కలిపినట్టే; కొన్ని ప్రాంతాలలో జరిగిన కొన్ని విషాద దుర్ఘటనలు పలుదేశాలను చేరువకు తీసుకువచ్చాయి. దేశనాయకుల మనసుల్లో మొదట ఏర్పడిన విభ్రాంతి, ఆగ్రహం క్రమేణా— వీటన్నిటికీ మూలమైన తీవ్రవాదాన్ని ప్రపంచంనుంచి సమూలంగా రూపుమాపాలనే అభిప్రాయానికి దారితీశాయి. అలా జరిగినప్పుడే ప్రపంచ ప్రజలు, శాంతి సామరస్యాలతో సుఖంగా జీవించడానికి సాధ్యపడుతుంది!

ఏ మతంగానీ, మనిషికీ మనిషికీ మధ్య ద్వేషాన్ని బోధించడంలేదు. ప్రేమ, కరుణ ప్రతి మతానికీమూలస్తంభాలు. పైగా మనం నివసిస్తూన్న ఈ ప్రపంచాన్ని, నివాసయోగ్యంగా భావితరాలకు అప్పగించవలసిన బాధ్యత మన అందరిమీదా ఉన్నది. అందువల్ల మతాలకు అతీతంగా మానవతా దృక్పథంతో మసలుకోవడం ఎంతైనా అవసరం. అప్పుడే మనం మనుషులం అనిపించుకోగలం. మానవతా దృష్టినీ, విశ్వమానవ ప్రేమనూ అలవరచుకుందాం. శాంతి సామరస్యాలతో జీవించి భావితరాలకు దారి చూపుదాం!

---

సంపాదకుడు : విశ్వం



హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్‌లో పాల్గొని ఆకర్షణీయమైన బహుమతులు గెలుచుకోండి!

# హీరోస్ ఆఫ్ ఇండియా - 3

రామాయణ మహాభారతాలంటే మీకు చాలా ఇష్టంకదూ! ఆ రెండు ఇతిహాసాలలోని కొందరు మహాపురుషులను గురించిన ఈ క్విజ్ మీ కోసం!

**అన్నీ సరైన సమాధానాలుగల మూడు ఎంట్రీలు సైకిళ్ళను బహుమతులుగా అందుకుంటాయి!**



1. స్నేహితులకోసం ప్రాణాలుసైతం ఇవ్వడానికిసిద్ధపడిన ఆ ధీరుడు సూర్యభగవానుడి కుమారుడు. దానగుణానికి ఆయన పెట్టింది పేరు. ఆయన ఎవరు?

------------------------------------------------

2. మాతృగర్భంలో ఉన్నప్పుడే యుద్ధవ్యూహాలను ఛేదించడం నేర్చుకున్నాడు. అశేష సేనావాహినిమధ్య పద్మవ్యూహాన్ని ఛేదించుకుని వెళ్ళి అనన్య సామాన్యంగా పోరాడి వీరమరణం పొందాడు. ఆ వీరుడి పేరేమిటి?

------------------------------------------------

3. లంకకు శ్రీరాముడి దూతగా ఒక వానర రాకుమారుణ్ణి పంపారు. ఆయన ఎవరు?

------------------------------------------------

4. స్వచ్ఛంద మరణాన్ని వరంగా పొందిన మహానుభావుడాయన. ప్రాణాలు వదలడానికిపుణ్యకాలం కోసం ఆయన అంపశయ్య మీద శయనించాడు. ఆయన ఎవరు?

------------------------------------------------

5. అన్నదమ్ములతో కలిసి అజ్ఞాతవాసం చేయవలసివచ్చినప్పుడు, ఈ అసమాన విలుకాడు ఒక ఏడాదిపాటు యువతులకు నాట్యం నేర్పే బృహన్నలగా కాలం గడపవలసి వచ్చింది. ఆయన ఎవరు?

------------------------------------------------

ప్రతి ప్రశ్నకు దిగువ చుక్కలతో చూపిన చోట మీ సమాధానాలను స్పష్టంగా రాయండి. ఈ ఐదుగురిలో మీకు చాలా ఇష్టమైన మీ మహాపురుషుడు ఎవరు? ఎందుకు అన్న విషయాలను పది పదాలకు మించకుండా రాయండి.

నా అభిమాన ఇతిహాస వీరుడు:

..................................................................

..................................................................

పాల్గొనేవారి పేరు: ..................................................

వయసు:..............తరగతి: ..........................................

చిరునామా:..........................................................

..................................................................

పిన్: ......................... ఫోన్: .........................

పాల్గొనేవారి సంతకం: ......................

తల్లి/తండ్రి సంతకం:.....................

వివరాలన్నీ పూర్తిగా నింపాక, ఈ పేజీ కత్తిరించి 2002 జనవరి 5వ తేదీలోగా అందేలా ఈ చిరునామాకు పంపండి:

**హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్-3**
**చందమామ ఇండియా లిమిటెడ్**
**82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ**
**ఈకాట్టుత్తాంగల్, చెన్నయ్-600 097.**

సూచనలు:

1. 8-14 ఏళ్ళ లోపు వయసు పిల్లలందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చు.
2. ఈ పోటీకి వచ్చే అన్నిభాషల ఎంట్రీల నుంచి ముగ్గురు విజేతలు ఎంపిక చేయబడతారు. విజేతలు వారికి తగిన సైజు సైకిళ్ళు అందుకుంటారు. సరైన సమాధానాలుగల ఎంట్రీలు ఒకటికన్నా ఎక్కువ వచ్చినట్లయితే, నా అభిమాన హీరో వివరణ ఆధారంగా విజేతలు ఎంపిక చేయబడతారు.
3. న్యాయనిర్ణేతలదే తుది నిర్ణయం.
4. ఈ విషయంగా ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరుపబడవు.
5. విజేతలకు విషయాన్ని పోస్టుద్వారా తెలియజేస్తాము.

బహుమతులను
మీకు అందజేస్తున్నవారు





# బాధ్యత!

రామాపురంలోని పెద్ద చెరువు గట్టు పక్కన కొందరు పేదవాళ్ళు గుడిసెలు కట్టుకుని వాటిల్లో నివసిస్తున్నారు. అలాంటి గుడిసెల్లో ఒకదానిలో కిష్టయ్య అనేవాడు, భార్యా ఇద్దరు పిల్లలతో ఉంటున్నాడు.

ఈ కిష్టయ్య బద్ధకం మనిషి. అలా గుడిసె ముందు నులకమంచంలో పడుకుని ఏవేవో పగటి కలలు కంటూండేవాడు. ఏదో ఒకరోజున తన అదృష్టం పండి గొప్ప సంపద లభిస్తుం దనేది వాడి నమ్మకం. ఎక్కడో ఎవరో ఏ శ్రమా, కాయకష్టం చేయకుండా అదృష్టంకొద్దీ లక్షాధికారులైపోయారనే నీలివార్తలు వాడు చాలా విన్నాడు. తనూ అలాంటి అదృష్టవంతుల్లో ఒకడు ఎందుకు కాకూడదు అన్నది వాడి ఆశ.

కుటుంబాన్ని పోషించవలసిన భర్త, బాధ్యత మరిచి సోమరిగా కలలుగంటూ పడి ఉండడం వాడి భార్య కమలమ్మకు పట్టరాని కోపం తెప్పించేది. ఏదో ఒక పని చేయకపోతే పూట గడిచేదెలా అంటూ, ఆమె ఎన్నోసార్లు భర్తకు నచ్చజెప్పాలని ప్రయత్నించినా, వాడు ఆమె మాటల్ని ఏమాత్రం లెక్కచేసేవాడు కాదు. చేసేదిలేక కమలమ్మే నాలుగిళ్ళల్లో పాచిపనిచేస్తూ, ఏదో ఒకవిధంగా కుటుంబ పోషణ జరుపుతూ వస్తున్నది.

ఒకరోజు కిష్టయ్య గుడిసె ముందు మంచంలో పడుకుని వుండగా, ఒక బక్క చిక్కిన కుక్క అటుగా వచ్చింది. దాని వెనకే దాని మూడు పిల్లలూ వచ్చాయి. అవి పాలు తాగడానికి తల్లిపై ఎగబడుతున్నాయి. కానీ కుక్క తన పిల్లలకు తగినన్ని పాలు ఇవ్వలేక పోతున్నది. ఆకలితో అలసి సొలసి వున్న కుక్క పిల్లలు, గుడిసెకు కాస్త దూరంగా మూలుగుతూ ముడుచుకుని పడిపోయాయి.

కోలపల్లి ఈశ్వర్

తల్లి కుక్క మెల్లిగా నక్కుతూ గుడిసెలోకి ప్రవేశించింది. అప్పుడే వండి వార్చివున్న అన్నపు కుండను చూసింది. అది అటూ యిటూ చూస్తూ కుండ దగ్గరకు వెళ్ళి, దానిలో మూతి పెట్టబోయింది.

అప్పుడే బయటనుంచి గుడిసెలోకి వస్తున్న కమలమ్మ అది చూసి కోపంతో అరుస్తూ,గోడకి ఆనించివున్న కర్రను కుక్క పైకి విసిరింది. కర్ర తిన్నగా పోయి కుక్క కాలికి తగలడంతో, అది కుయ్యోమని కుంటుతూ బయటికి పరిగెత్తింది.

కుక్క ముట్టిన కుండలోని అన్నం ఎలా తినడం, అని బాధపడుతూ కమలమ్మ కుండలోని అన్నాన్ని బయటపడేసింది. ఆ వెంటనే తల్లి కుక్కా, దాని పిల్లలూ అన్నం దగ్గరకు చేరాయి. కడుపునిండా తిన్న తల్లి కుక్క, తన పిల్లలకు పాలివ్వడానికి కావలసిన శక్తిని సంపాదించుకున్నది.

మర్నాడు అదే సమయంలో గుడిసెలోకి వెళ్ళింది, ఆ కుక్క. ఐతే అనుకోకుండా అక్కడికి వచ్చిన కమలమ్మ కాస్త దూరంనుంచే దానిపైకి రాయి విసిరింది. రాయి దెబ్బకు కుక్క అరుస్తూ పారిపోవడం--అంతా క్షణాల మీద జరిగిపోయింది.

ఈ గొడవకు నుక్కిమంచంలో తియ్యటి కలలు కంటున్న కిష్టయ్య అదిరిపడి లేచి, జరిగిందేమిటో గ్రహించాడు. వాడు గట్టిగా విసుక్కుంటూ, "పాడు కుక్క మళ్ళీవచ్చిందీ? నిన్న అంత పెద్ద దెబ్బ తగిలినా, దానికి బుద్ధి రాలేదన్నమాట!" అన్నాడు.

వెంటనే కమలమ్మ వాడికేసి తీవ్రంగా చూస్తూ, "కన్నందుకు ఎంతకష్టపడి అయినా పిల్లల్ని పెంచాలని దాని తాపత్రయం. ఒక దెబ్బ తగిలితే తగులుతుంది, కానీ నిన్నటిలా అన్నం దొరుకుతుందిగదా, అని దాని ఆశ! పిల్లల ఆకలి తీర్చడానికి ఒక కుక్కే అంతగా ఆరాటపడుతూంటే, నీలాంటి బాధ్యత ఎరగని మనిషి సంగతేమిటి?" అంటూ విసురుగా గుడిసెలోకి పోయింది.

భార్య మాటల్లోని పరమార్థాన్ని గ్రహించిన కిష్టయ్య, నుక్కిమంచం దిగి, దాన్ని గోడ పక్కకు బరబరా ఈడ్చి, ప్రయత్నిస్తే ఏదో ఒక పని దొరక్కపోతుందా అనుకుంటూ గ్రామంలోకి బయలుదేరాడు.



# వర్తకబుద్ధి

పూర్వం ఒక వర్తకుడు వడ్డీవ్యాపారం, ఇతరత్రా అనేకరకాల వ్యాపారాలు చేసి లక్షలు ఆర్జించాడు. ఒక్కొక్కసారి ఆయనకు తీరికసమయాల్లో, దాపులనున్న సరస్సుకుపోయి చేపలు పట్టడం అంటే చాలా ఇష్టం. ఒకనాడావర్తకుడు చిన్నపడవలో సరస్సులో కొంతదూరంపోయి వల వేశాడు. వలలో చేప ఒకటి పడింది. వలను నీటినుంచి పైకిలాగి చేపను పడవలో జారవిడిచాడు.

అది మామూలు చేపకాదు, పంచవన్నెల చేప. సూర్యకాంతిలో వివిధరకాల కాంతులు వెదజల్లుతూ మెరిసిపోతున్నది. వర్తకుడు ఇదిచూసి ఆశ్చర్యపడుతున్నంతలో చేప ఊపిరాడక అటూ ఇటూ కొట్టుకుంటూ, "నేను కిన్నరజాతి చేపను! మూడువరాలు కోరుకో ఇస్తాను. నన్నుత్వరగా సరస్సులో వదులు," అన్నది.

"మూడు కాదు, ఐదు వరాలివ్వు!" అన్నాడు వర్తకుడు.

చేప గిలగిల్లాడిపోతూ, "మూడంటే మూడే! ఆ వరాలు కోరుకుని నన్ను త్వరగా సరస్సులో పడవెయ్యి. ఊపిరాడడం లేదు," అన్నది ఆయాసపడుతూ.

"సరే! పెద్దగా బేరం ఆడడం లేదు. నాలుగున్నర వరాలివ్వు," అన్నాడు వర్తకుడు.

"కాదు, మూడంటే మూడే!" అన్నది చేప, వణుకుతున్న చిన్న స్వరంతో.

"సరే, నేను వర్తకుణ్ణి. అట్టే తీసితీసి బేరాలాడే స్వభావంకాదు నాది. నాలుగున్నరకాదు, నాలుగు వరాలివ్వు చాలు," అన్నాడు వర్తకుడు.

చేప జవాబివ్వలేదు. అది ఆసరికే ప్రాణాలు విడిచింది.



ORISSA
*The soul of India*

మీకు ఒక క్విజ్

# కోణార్క్

December 1-5, 2001 Konark Festival

చూపరులకు అద్భుతాశ్చర్యాలు కలిగించే దేవాలయాలలో ఒకటైన సూర్యదేవాలయం ఒరిస్సా రాష్ట్రంలోని కోణార్క్‌లో ఉన్నది. 13వ శతాబ్దంలో నిర్మించబడిన ఈ దేవాలయాన్ని ఆలయ నిర్మాణ కళలో ఒక అద్భుతంగా చెబుతారు. కోణ్-అర్క్ (సూర్యకోణం) అనే ఈ అందమైన దేవాలయం పేరు మీదుగానే ఇక్కడి పట్టణానికి కోణార్క్ అనే పేరు వచ్చింది.

ఈ ఆలయ ఆకారమే ఒక విలక్షణమైనది. ఇది బ్రహ్మాండమైన సూర్యుడి రథాకృతిలో నిర్మించబడి ఉన్నది. పన్నెండు జతల చక్రాలు; జీవం ఉట్టిపడేలా రథాన్ని లాగుతున్నట్టు కనిపించే ఏడు గుర్రాలతో దేవాలయ అద్భుత రూపం పూర్తవుతుంది.

చక్రాలు 12 నెలలనూ, గుర్రాలు వారంలో ఏడు రోజులనూ సూచిస్తాయి. దేవాలయం సముద్ర తీరంలో బంగాళాఖాతానికి అభిముఖంగా ఉండడంవల్ల వివిధకోణాలలో సూర్యకిరణాలు ఆలయం మీదపడి వింత శోభను సమకూరుస్తాయి.

ఈ దేవాలయాన్ని 'నల్లటి దేవాలయం' అని కూడా చెబుతారు. 70మీ. ఎత్తయిన ఆలయ ప్రధానగోపురం పడిపోయింది. అయితే, నర్తనశాల, సభామంటపం శిథిలం కాకుండా ఉన్నాయి. దేవాలయం అనేకశిల్పాలతో, కుడ్యశిల్పాలతో అలరారుతున్నది.

'వరల్డ్ హెరిటేజ్ సైట్' గా యునెస్కో గుర్తించనున్న మనదేశంలోని పలు స్మృతిచిహ్నాలలో కోణార్క్ సూర్యదేవాలయం కూడా ఒకటి!

ఆలయ శిథిలాలనుంచి సేకరించిన అనేక శిల్పాలతో, ఏర్పాటుచేయబడిన సూర్యదేవాలయ 'మ్యూజియం' కోణార్క్‌లో ఉన్న మరొక ఆకర్షణ!

మీకు ఒక క్విజ్
**14- ఏళ్ళ లోపు పిల్లలకు**
**పోటీ-4**

1. సూర్యదేవాలయానికి కొద్ది దూరంలో కుశభద్రా నది సముద్రంలో సంగమించే చోట ఒక సుప్రసిద్ధ దేవాలయం నిర్మించబడి ఉన్నది. దాని పేరేమిటి?

..................................................

2. ఒకప్పుడు ఓడరేవుగా ఉన్న ఒరిస్సా సముద్ర తీరం ఏది?

..................................................

3. ఆసియాలోనే అతిపెద్ద కృత్రిమ జలాశయంగా ప్రసిద్ధిగాంచిన ఒరిస్సాలోని ఆనకట్ట (డ్యామ్) ఏది?

..................................................

మీ సమాధానాలను చుక్కలతో చూపినచోట స్పష్టంగా రాసి, కూపన్‌ను నింపి ఎంట్రీలను కింది చిరునామాకు పంపండి:

**Orissa Tourism Quiz Contest**
**Chandamama India Limited**
**No.82, Defence Officers Colony**
**Ekattuthangal, Chennai - 600 097**

పేరు :..........................................
వయసు :..........................................
చిరునామా :..........................................
..........................................
పిన్ ........................ ఫోన్ ...........




Winners picked by Orissa Tourism in each contest will be eligible for **3-days, 2-night** stay at any of the **OTDC Panthanivas**, upto a maximum of four members of a family. Only original forms will be entertained. The competition is not open to CIL and Orissa Tourism family members. Orissa Tourism, Paryatan Bhaven, Bhubaneswar-751 014. Ph: (0674) 432177, Fax : (0674) 430887, e-mail : ortour@sancharnet.in. Website : Orissa-tourism.com




# 12

[ఖడ్గజీవదత్తులు యుక్తిగా వీరపురసైనికుల్ని బిలదుర్గంలో చుట్టుముట్టి, సేనానాయకుడితోపాటు సైనికులందరూ సులభంగా లొంగిపోయేలా చేశారు. సమరబాహుతోపాటు వాళ్ళిద్దరూ కొండకోట దగ్గరకు వచ్చేసరికి, అక్కడ వృద్ధుడైన వీరపుర మంత్రి కనిపించాడు. అతడు సమరబాహును తన రాజుపక్షాన కొండకోటకు స్వతంత్రుడైన రాజుగా అంగీకరించి, ఖడ్గజీవదత్తులతో సమీపంలోని నది దగ్గరకు వెళ్ళాడు. — తరవాత]

ఖడ్గజీవదత్తులూ, వీరపురమంత్రీ నది ఒడ్డుకు చేరేసరికి, రథాకారంలో వున్న పడవ నీటి మీద తేలియాడుతూ వాళ్ళున్న చోటుకు రాసాగింది.

ఖడ్గజీవదత్తులు పడవకేసి పరీక్షగా చూసి, అది రథాకృతిలో తయారుచేసిన కొయ్య పడవ అని గ్రహించారు.

. జీవదత్తుడు, వీరపురమంత్రికేసి తల తిప్పి, "మహామంత్రీ! ఒకానొక యక్షుడి వల్ల, మా గురించిన సమాచారం తెలిసిందన్నారు. ఆ యక్షుణ్ణి మీరీ పడవలోనే కలుసుకున్నారా?" అని అడిగాడు.

"క్షత్రియ యెూధుల్లారా! దాపరికం లేకుండా మీకు జరిగిన సంగతి చెప్పేస్తాను. గడచిన రాత్రి రెండవ జాము వేళలో, ఒక యక్షుడు ఆకాశ మార్గాన రథంలో వచ్చి, భవనం మీద చెలికత్తెలతో ఇష్టాగోష్ఠి చేస్తున్న వీరపుర రాజపుత్రిక వసంతకుమారిని బలాత్కారంగా అపహరించుకుపోయాడు. అతడు అక్కణ్ణించి వెళ్ళేప్పుడు భవనం మీద ఒక తాళపత్రాన్ని వదిలి వెళ్ళాడు. ఆ తాళపత్రంలో రాసివున్న దానినిబట్టి ఆలోచించి చూస్తే, ఆ దుర్మార్గుడు లోగడ పద్మసేన మహారాజు కుమార్తె సౌందర్యరాశి



అయిన పద్మావతిని కూడా, ఈ విధంగానే అపహరించుకుపోయినట్టు తెలిసింది,'' అన్నాడు మంత్రి.

మంత్రి మాటలు వింటూనే జీవదత్తుడు కోపంగా, ''ఆ యక్షుడు పద్మావతిని వివాహ మాడి తీసుకుపోతున్నట్టు, మాతో అరణ్య పుర ప్రాంతంలో అబద్ధమాడాడు!'' అన్నాడు.

''అలాగునా, జీవదత్తా! యక్షుడు వదిలి పోయిన తాళపత్రంలో వున్న దానిని బట్టి మీరు వింధ్యపర్వతాల్లో ఎక్కడో వున్న రాతి రథాన్నొకదాన్ని కదిలించగలమని ప్రతిజ్ఞ చేశారట! అవునా?'' అని అడిగాడు మంత్రి.

జీవదత్తుడు జవాబివ్వబోయేంతలో ఖడ్గవర్మ, ''నిజమే! ఆ క్రూరుడైన యక్షుణ్ణి, మా ఆయుధాలకు ఎరచేసి, వాడికి బందీలుగా చిక్కిన పద్మావతీ, వసంతలను విడిపించుకు రాకపోతే, మేం క్షత్రియులమే కాదు!'' అన్నాడు.

ఆ సరికి పడవ ఒడ్డు చేరింది. పడవ ముందు భాగానికి, యక్షుడిలా భూషణా లంకారాలు ధరించిన వ్యక్తి ఒకడు వచ్చి, ఒక క్షణకాలం అందరినీ పరీక్షగా చూసి, ''వింధ్య పర్వతాల్లో వున్న రాతిరథాన్ని కదిలించే మహావీరులు మీలో ఎవరు?'' అని అడిగాడు.

ఖడ్గజీవదత్తులు మౌనంగా చేతులెత్తారు. అప్పుడు యక్షుడు కొంచెం హేళన స్ఫురించే స్వరంతో, ''అయితే, మీ ఇద్దరూ నిర్భయంగా పడవలోకి రావచ్చు. నా మిత్రుడు యక్ష మణిరంజితుడు వుండే యక్షపర్వతానికి మిమ్ములను తీసుకుపోతాను. అతడు వివాహమాడ దలచిన పద్మావతీ, వసంత కుమారీ అనే రాజకన్యలు అక్కడే వున్నారు,'' అన్నాడు.

ఖడ్గజీవదత్తులు, మంత్రికి వీడ్కోలు చెప్పి, పడవలోకి వెళ్ళారు. జీవదత్తుడు, యక్షుణ్ణి, ''నీ పేరేమిటి?'' అని అడిగాడు.

''మణిభూషణుడు. నా మిత్రుడైన మణి రంజితుడు శౌర్యసాహసాల్లో అతడికతడే సాటి. మంత్రతంత్ర శక్తుల్లో అందెవేసిన చేయి. మీరు యక్షపర్వతానికి రావడ మంటే, ప్రాణాల మీదికి తెచ్చుకోవడమే!'' అన్నాడు.

'' ఓహో, అలాగునా!'' అంటూ జీవద త్తుడు తన చేతిలోని దండాన్ని యక్షుడి భుజానికి ఆనించాడు. ఆ వెంటనే వాడు పిడుగుదెబ్బ తిన్న వాడిలా ఎగిరి గంతేసి

నిలుపెల్లా వణికి పోతూ, "ఏమిటిది, మంత్ర దండమా? నీలో అంత గొప్ప మంత్ర శక్తి ఉన్నదా?" అన్నాడు.

జీవదత్తుడు మౌనంగా మంత్రాన్ని జపించి, ఈసారి యక్షుడి భుజాన్ని తన చూపుడు వేలితో తాకాడు. యక్షుడు ఒక చావుకేక పెట్టి దభీమంటూ కిందపడిపోయి, కొద్ది సేపటి తర్వాత ఆయాసపడుతూ లేచి, "నువ్వు నా స్నేహితుడికి సరైన ఉజ్జీవి. మీ ఇద్దరికీ శత్రుత్వమెందుకు?" అన్నాడు.

ఖడ్గవర్మ కోపంగా కత్తి పైకెత్తి, "ఒరే, యక్షుడా! అట్టే చచ్చుపుచ్చు మాటలు మాట్లాడక, పడవను నీ మిత్రుడుండే యక్షపర్వతం కేసి నడుపు.వాణ్ణి ముక్కలుగా నరికి కాకు లకూ, గద్దలకూ ఆహారంగా వేస్తాం," అన్నాడు.

ఇద్దరు మానవమాత్రులు తనను ఇంతగా హడలగొట్టటం చూసి, మణిభూషణుడు అవమానంతో విలవిలలాడిపోతూ, "క్షత్రియ యోధుల్లారా! మిమ్మల్ని మణిరంజితుడు తనవద్దకు తీసుకురమ్మన్నాడు. రాజకుమార్తెల అపహరణా, రాతిరథం గొడవల్తో నాకు ఎలాంటి ప్రమేయం లేదు," అన్నాడు.

తర్వాత జీవదత్తుడు ఆజ్ఞాపించగానే యక్షుడు పడవ చుక్కాని పట్టి, దాన్ని నది మధ్యకు నడపబోతున్నంతలో వీరపురం మంత్రి చేయెత్తి ఖడ్గజీవదత్తులను దీవిస్తూ, "శీఘ్రమే కార్యసిద్ధి కలుగుగాక!" అన్నాడు.

పడవ నది మధ్యకు రాగానే జీవదత్తుడు, ఇది యక్షమణిరంజితుడు ఆకాశంలో కూడా ఎగిరేందుకు ఉపయోగించే పడవేమో అని అనుమానించి, యక్షుణ్ణి ఆ సంగతి అడిగాడు.



దానికి మణిభూషణుడు, "మణిరంజితుడు ఆకాశగమనానికి ఉపయోగించే పడవ ఇదికాదు. అదివేరు. ఆయనకు రథాకృతిలో వున్న వస్తువులంటే తగని మక్కువ, అంతే!" అన్నాడు.

"అలాగా పాపం!" అంటూ జీవదత్తుడు నవ్వి, నదికి రెండువైపులా వున్న పర్వతాలనూ, వాటిమీద ఒత్తుగా పెరిగివున్న మహావృక్షాలనూ చూస్తూ, యక్షుణ్ణి, "ఇదంతా వింధ్య పర్వత ప్రాంత మేనా?" అని ప్రశ్నించాడు.

యక్షుడు అవునన్నట్టు తల ఊపాడు. జీవదత్తుడు అస్తమించబోతున్న సూర్యుడి కేసి ఒకమారు చూసి, ఖడ్గవర్మతో, "మనం ఈ రాత్రికి నది ఒడ్డునే భోజనం ఏర్పాటు చేసుకుని, సూర్యోదయంతోనే ప్రయాణం సాగించడం బావుంటుంది," అన్నాడు.

ఆ మాటలు విన్న మణిభూషణుడు కాస్త చిరాకుపడుతూ, "నా మిత్రుడు మణి రంజితుడు మిమ్మల్ని సాధ్యమైనంత త్వరగా యక్షపర్వతం దగ్గరకు తీసుకు రమ్మన్నాడు. ఈ రాత్రికి మనం ఇక్కడ ఉండిపోతే, చాలా కాలయాపన జరిగి పోతుంది," అన్నాడు.

అందుకు జీవదత్తుడు కఠినమైన స్వరంతో, "ఇక్కడ ఆజ్ఞలు ఇచ్చేది నేను. కన్యాపహరణలో సిద్ధహస్తుడైన నీ మిత్రుడు మణి రంజితుడు కాదు! చుక్కాని తిప్పి పడవను ఒడ్డుకు నడుపు, విన్నావా?" అన్నాడు.

యక్షుడు కిక్కురుమనకుండా పడవను నది మధ్యనుంచి ఒడ్డుకేసి నడిపాడు.

ఖడ్గజీవదత్తులు పడవలోంచి నేలమీదికి దూకారు. జీవదత్తుడు, ఖడ్గవర్మతో, "ఖడ్గా, నేను, కీకారణ్యంగావున్న ఈ చుట్టుపక్కల అరణ్యంలో, ఏ లేడినో దుప్పినో వేటాడి తెస్తాను. ఈ లోపల నువ్వు ఎండుపుల్లలూ అవీ పోగు చేసి నిప్పు రాజెయ్యి," అన్నాడు.

యక్షభూషణుడు ఆ మాటలు వింటూనే భయపడినవాడిలా ముఖం పెట్టి, "జీవదత్తా! ఇక్కడి అరణ్యం, భయంకరులైన రాక్షసులకు ఆవాసం. చాలా ప్రమాదకరం!" అన్నాడు.

జీవదత్తుడు నవ్వి, "రాక్షసులకన్నా కూడా భయంకరులూ, మంత్ర తంత్రవేత్తలూ అయిన మీ యక్షుల మధ్యకు పోనున్న నేను, ఇక్కడి రాక్షసులకెందుకు భయపడాలి?" అంటూ చెట్లలోకి నడిచాడు.

తరవాత, ఒక్క పావుగంట గడిచీగడవక ముందే లేడినొకదాన్ని వేటాడి భుజాన వేసుకుని తిరిగి వచ్చాడు. క్షణాలమీద ఖడ్గజీవదత్తులు లేడిని కోసి, దాని మాంసాన్ని నిప్పుల మీద కాల్చసాగారు. మాంసం కాలుతున్న వాసన, ఆ చుట్టుపక్కల వ్యాపించింది.

ఆ సమయంలో భయంకరాకారంలో వున్న ఒక రాక్షసి, గుబురు చెట్లలోంచి చేతులు చాచి ముందుకొస్తూ, "నరవాసన! నరవాసన!"



అంటూ అరిచింది.

దాన్ని చూస్తూనే కత్తి దూయబోయిన ఖడ్గవర్మను వారిస్తూ, జీవదత్తుడు, ''ఇక్కడ నరవాసనతోపాటు కాలుతూన్న లేడి మాంసం వాసన కూడా వస్తున్నదిగదా. నువ్వు రాక్షసివా లేక రాక్షసిరూపం ధరించిన యక్షుడివా? '' అని అడిగాడు.

''ఎవర్రా నువ్వు? మనిషివై వుండి నన్ను చూడగానే బెదిరి గుండెలవిసి చావక, నన్నే ఎదురు ప్రశ్నిస్తున్నావా?'' అన్నది రాక్షసి ఆశ్చర్యపోతూ.

ఆ వెంటనే జీవదత్తుడు తన మంత్ర దండాన్ని రాక్షసి తలకు ఆనిస్తూ, ''రాక్షసీ! ఇప్పుడు చెప్పు, మేం మామూలు మనుషులమా లేక...'' అంటూ ఆగాడు.

రాక్షసి నిలువెల్లా కంపించిపోతూ, ''మీరు మనుషులు కారు, యక్షులైవుంటారు! నా ఇద్దరు కొడుకుల్నీ మీరు లోగడే పట్టుకుని యక్షపర్వతానికి తీసుకుపోయారుగదా. నేను వయసుమళ్ళినదాన్ని ఆ యక్షపర్వతం పొట్టలో రాళ్ళూరప్పలూ కొట్టి, మీకోసం బంగారం, మణులు బయటికి తీయలేను,'' అన్నది.

జీవదత్తుడు, రాక్షసికి ధైర్యం చెబుతూ, ''నిన్ను చంపడం, నా ఉద్దేశ్యం కాదు. నీకు యక్షపర్వతం గురించి చాలా సమాచారం తెలిసినట్టున్నది. మేమిద్దరం యక్షపర్వతానికి పోతున్నాం. అదుగో, ఆ పడవలో వున్నవాడు యక్షుడు. వాళ్ళను గురించిన రహస్యాలు ఇక్కడ చెప్పవద్దు. ముందుండి నీ గుహకు దారితియ్యి,'' అన్నాడు.

''అయ్యా, నరుడా! మా గుహ దాపులనే వున్నది. నా భర్త గుహలోనే వున్నాడు. అతడు



మీకు యక్షపర్వతాన్ని గురించిన భయంకర రహస్యాలు చెప్పగలడు,'' అన్నది రాక్షసి.

రాక్షసి ఇంకా కంపించిపోతూనే, జీవదత్తుణ్ణి వెంటబెట్టుకుని నాలుగైదు నిమిషాల్లో ఒక గుహ ముందుకు తీసుకుపోయింది. గుహ ముందు మహాకాయుడైన రాక్షసుడొకడు పెద్ద కాగడా వెలుగులో ఒక బండ రాయికి చేరగిలబడి కూర్చుని వున్నాడు.

వాడు జీవదత్తుణ్ణి చూస్తూనే, ''ఆశ్చర్యం! పరమఆశ్చర్యం! ఈ నరమానవుడెవడు? నిర్భయంగా నీ వెంట వస్తున్నాడు,'' అన్నాడు రాక్షసితో.

రాక్షసి ముందుగా తన భర్తను సమీపించి, ''నువ్వు ఆకలికొద్దీ ఈయన్ని నమిలి మింగాలని జూసేవు, జాగ్రత్త! ఈ మనిషి చేతిలో గొప్ప మంత్రదండం వున్నది. ఈయనా, ఈయన నేస్తం కలిసి ఒక యక్షుణ్ణే బంధించి పడవలో



తెచ్చారు!'' అన్నది.

రాక్షసుడు, జీవదత్తుడికేసి అమితాశ్చర్యంతో కళ్ళింతచేసి చూస్తూ, ''అయ్యా, నా పెళ్ళాం చెప్పేమాట నిజమేనా? ఇది కాస్త పెర్రిబాగులది!'' అన్నాడు.

జీవదత్తుడు చిన్నగా నవ్వి, ''నీ పెళ్ళాం చెప్పినదాంట్లో అబద్ధం ఏమీలేదు. నీ కొడుకు లిద్దరినీ యక్షులు బందీలుగా పట్టుకుపోయి ఎక్కడో యక్షపర్వతంలో వుంచారని విన్నాను. ఆ పర్వతాన్ని గురించిన రహస్యాలేమైనా నీకు తెలుసా?'' అని అడిగాడు.

రాక్షసుడు తలాడిస్తూ కొంచెంసేపు నేల చూపులు చూసి, ''యక్షపర్వతానికీ, దాని పరిసరాలకూ మణిరంజితుడనేవాడు అధిపతి. వాణ్ణి యక్షరాజు చాలాకాలం కిందట అధిపతిగా నియమించాడు. వాడు చేయని ఘోరం అంటూ ఏమీలేదు,'' అన్నాడు.

''వాడు పరమకిరాతకుడని నాకు తెలుసు. మా దేశంలోని ఇద్దరు రాజకుమార్తెలను చెరబట్టి తీసుకుపోయాడు. సరే, అక్కడ ఏదైనా రాతి రథంలాంటిది వున్నదా?'' అని అడిగాడు జీవదత్తుడు.

''అయ్యా, ఉన్నది. ఆ రథాన్ని కొండలోనే మలిచినట్టు చెప్పుకుంటారు!'' అన్నాడు రాక్షసుడు.

జీవదత్తుడు అక్కణ్ణించి బయల్దేరుతూ, రాక్షసితో, ''నువ్వు నరవాసన అంటూ వచ్చి నా కంటబడటం చాలా మేలే అయింది. నా వెంట వచ్చి కాల్చిన లేడిమాంసంలో, నీక్కావలసినంత ఎత్తుకుపో,'' అన్నాడు.

కొద్దిసేపటి తర్వాత జీవదత్తుడి వెంట రాక్షసి రావటం చూస్తూనే యక్షమణిభూషణుడు గజగజలాడిపోతూ, ఖడ్గవర్మతో, ''ఇదేమిటి? నీ మిత్రుడు రాక్షసిని వెంట బెట్టుకు వస్తున్నాడు?'' అన్నాడు.

''బహుశా, నిన్ను దానికి ఆహారంగా ఇస్తానన్నాడేమో, జీవదత్తుడు! రానీ, అడిగి చూద్దాం,'' అన్నాడు చిరునవ్వుతో ఖడ్గవర్మ.

''ఇది అన్యాయం! మణిరంజితుడు నాకు యజమానికింద లెక్క, స్నేహితుడు కాదు. అతడి ఆజ్ఞలు నిర్వహించటం తప్ప, నాకై నేను ఇతరులకు చేసిన హాని ఏమీలేదు,'' అన్నాడు మణిభూషణుడు.

అక్కడికి వస్తూ, ఆ మాటలు విన్న జీవదత్తుడు కోపంగా, ''మణిభూషణా, ఇప్పటినుంచే చావు భయంతో మతికాస్తా పోగొట్టుకోకు. ఒకవేళ నేనూ, ఖడ్గవర్మా నీ యజమాని మణిరంజితుణ్ణి జయించలేక పోతే - మీ యక్షమూకను పట్టుకుని చిత్రహింసలకు

గురిచేయటానికి, ఈ దాపులనే అపర రావణా సురుడివంటివాడి నాయకత్వాన పెద్ద రాక్షస సేన సిద్ధంగా వుంది. వాళ్ళు మీ పర్వతాన్ని నేలమట్టం చేస్తారు,''అన్నాడు.

''రాక్షససేనా?''అంటూ మణిభూషణుడు తెల్లబోయాడు.

''అవును, రాక్షస సేనే! ఆ మాట బాగా గుర్తుంచుకో,''అని, జీవదత్తుడు రాక్షసితో, ''మొహమాటపడక, లేడిమాంసంలో అవసరం అనుకున్నంత తీసుకుపో. ఇంకో సంగతి. యక్షపర్వతం మీద దాడికి ఇంకా సమయం రాలేదని, వేల సంఖ్యలోవున్న మీ రాక్షసులకు నాయకుడైన మహోగ్రనేత్రుడికి చెప్పు,'' అంటూ జీవదత్తుడు చిన్నగా చిటికె వేశాడు.

రాక్షసి అడ్డదిడ్డంగా తలాడించి లేడిమాంసం తీసుకుని తన గుహకేసి వెళ్ళిపోయింది. తర్వాత ఖడ్గజీవదత్తులూ, మణిభూషణుడూ భోజనాలు ముగించి, ఒక చెట్టు కింద చదునుగా వున్న రాళ్ళమీద పడుకున్నారు. మణిభూషణుడు, ఖడ్గజీవదత్తుల నుంచి కొంచెం దూరంగా పక్క వేసుకున్నాడు. అతడు పడుకునేముందు నది ఒడ్డున కట్టివున్న పడవకేసి ఒకటికి రెండుసార్లు చూడటం గమనించిన జీవదత్తుడు, ఖడ్గవర్మను రహస్యంగా, ''యక్ష వెధవ మనమంటే హడలిపోతున్నాడు. ఏ రాత్రి వేళనో పడవ ఎక్కి పారిపోతాడేమో కాస్త మెలుకువగా వుండి చూస్తూ వుండు,''అని హెచ్చరించాడు.

ఖడ్గవర్మకూ్కడా, మణిభూషణుడి గురించి ఇలాంటి అనుమానమే వున్నది. ఆ కారణం చేత అతడు నిద్రపోతున్నట్టే నటిస్తూ, యక్షుణ్ణి ఒక కంట కనిపెడుతూనే వున్నాడు.

నడిరేయి వేళ నేలను మూచూ్స్తూ, అక్కడికి ఒక ఎలుగుబంటూ, తోడేలూ వచ్చినై. అవి లేడిమాంసం వాసన పసిగట్టి వుండాలి! ఆ రెండూ గిరికీలు తిరుగుతూ, మణిభూషణుడికేసి వెళ్ళబోయేంతలో, చప్పుడుకు ఖడ్గవర్మ లేచి కూర్చుని, వాటి మీదికి చిన్న రాయి విసిరాడు. ఆ వెంటనే అవి చెట్ల చాటుకు పరిగెత్తినై.

ఆ అలికిడికి యక్షమణిభూషణుడు కళ్ళుతెరిచి, చెట్లచుట్టూ కలయచూస్తూ ''ఖడ్గజీవదత్తుల్లారా, లేవండి! రాక్షసులు గుంపులుగా వచ్చిపడుతున్నారు!'' అంటూ అరవసాగాడు. —(ముగింపు వచ్చేసంచికలో)



# పలుకుబడి

మామిళ్ళపల్లి జమీందారు శ్రీపతికి అనుకోకుండా ఒక గడ్డుసమస్య ఎదురైంది. ఎంతోకాలంగా జమీపొలాల్లో పనిచేసే వ్యవసాయకూలీల మీదా, పాలెకాపులమీదా నమ్మకంగా, సమర్థవంతంగా అధికారబాధ్యతలు నిర్వహించిన గౌరీశంకరుడు హఠాత్తుగా మరణించాడు. గౌరీశంకరుడు, తనవద్ద పనిచేసే అందరిమీదా ఎంతో పలుకుబడి కలవాడు.

శ్రీపతి, ఎవరిని కొత్త అధికారిగా నియమించడమా అన్న సమస్యతో కొట్టుమిట్టాడుతూండగా, రాణీగారి వంటశాలల బాధ్యతలు నిర్వహించే రుక్మిణమ్మ, ఆయనను చూడవచ్చింది.

"ఏమిటిసంగతి, ఇలావచ్చావు?" అని అడిగాడు శ్రీపతి. "ప్రభూ! గౌరీశంకరుడు అంతహఠాత్తుగా పోవడం చాలా బాధకలిగిస్తున్నది. తమరు కొత్తఅధికారిని నియమించే ఆలోచనలో వున్నట్టు రాణిగారు చెప్పారు," అన్నది రుక్మిణమ్మ.

"అవునుమరి, పొలం పనులు సక్రమంగా సాగేందుకు, ఒక అధికారి అవసరంగదా! ఎవరిని పదవిలో నియమించడమా అని ఆలోచిస్తున్నాను," అన్నాడు శ్రీపతి.

"ప్రభూ, నా కొడుకు చెన్నకేశవుణ్ణి గురించి తమకు విన్నవించేందుకు వచ్చాను. వాణ్ణి తమరెరుగుదురు. గౌరీశంకరుడికి వాడంటే ఎంతో ఆదరణ. తెలివైనవాడు, చురుకైనవాడు. ఎంతశ్రమకైనా ఓర్వగల లక్షణం వున్నవాడు,"అన్నది రుక్మిణమ్మ.

ఆ మాటలకు శ్రీపతి నవ్వి, "అన్నీ బాగానే వున్నవి. నీ కొడుకుతో ఒకటి రెండు సందర్భాలలో మాట్లాడానుకూడా. కానీ, ఆ పదవికి ఎంతో పలుకుబడి అవసరం. అది నీ కొడుక్కులేదుగదా!" అన్నాడు. రుక్మిణమ్మ ఒక క్షణం ఆలోచించి, "ప్రభూ! మీరు నియమించిన పదవే, వాణ్ణి పలుకుబడిగలవాణ్ణి చేస్తుంది!" అన్నది. ఆ మర్నాడే జమీందారు,రుక్మిణి కొడుకును జమీపొలాలమీద అధికారిగా నియమించాడు.







# ముని ఆంతర్యం!

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా! నువ్వు అసహాయశూరుడివి. అందులో ఇసుమంత సందేహం లేదు. అయితే, భయంకరమైన ఈ కార్యానికి నిన్ను పురికొల్పిన వారెవరో నాకు తెలియదు. మర్మ పదజాలంతో నిగూఢంగా మాట్లాడే ముని ఎవరైనా నిన్నీపనికి పురికొల్పడంవల్ల తొందరపాటుతో నువ్విందుకు పూనుకుని వుంటే మాత్రం పరాజయం పొందడంతథ్యం! ఎందుకంటే అలాంటి వారి మాటలు అర్థం చేసుకోవడం అసాధ్యం.



ఈ విషయంలో నీకు తగు హెచ్చరికగా ఉండేం దుకు జ్ఞానానందుడనే ముని మాట విని, తొందరపాటు నిర్ణయం తీసుకున్న మార్తాండ వర్మ అనే రాజుకథ చెబుతాను, శ్రమ తెలియ కుండా,విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒకానొకప్పుడు మరకత రాజ్యాన్ని మార్తాం డవర్మ అనే రాజు పాలించేవాడు. ఆయన వివేకసంపన్నుడుగానూ, పరిపాలనాదక్షుడు గానూ పేరుగాంచాడు. ఆయన ఆస్థానంలోని వృద్ధసలహాదారు హఠాత్తుగా మరణించడంతో కొత్తసలహాదారును నియమించవలసివచ్చింది. ఏ విషయంలోనైనా, ఒక నిర్ణయానికి వచ్చే ముందు ఆ విషయాన్ని అన్ని కోణాలనుంచీ నిశితంగా పరిశీలించి సత్యాన్ని గ్రహించగల సునిశితబుద్ధి,వివేచనాజ్ఞానం కలిగిన వ్యక్తినే తనసలహాదారుగా నియమించాలని తీవ్రంగా ఆలోచించిన రాజు, తన ఆస్థానంలోనే ఉన్న మణిభద్రుడనే వ్యక్తి అందుకు తగినవాడని భావించాడు.

ఆ సంగతి తెలిసిన మహారాణి ఇందుమతీ దేవి, రాజు ఒకనాడు తన అంతఃపురానికి వచ్చి నప్పుడు, ''విశ్వబంధు చాలాకాలంగా తమ ఆస్థానంలోనే ఉన్నాడు. ఆయన తెలివితేటల్లో మణిభద్రుడికి ఏమాత్రం తీసిపోడు. పైగా ఆయన వయసులో మణిభద్రుడి కన్నా పెద్దవాడు; అనుభవజ్ఞుడు. మనకు దూరపు బంధువుకూడా. ఆయనే తమకు అన్నివిధాలా సరైన సలహాదారుగా ఉండగలడని భావిస్తు న్నాను,'' అన్నది రాజుతో.

''నిజంగానే అంతటి సమర్థవంతుడై నట్టయితే, విశ్వబంధును సలహాదారుగా నియమించడంలో నాకు ఎలాంటి అభ్యంత రమూ లేదు. అయినా, మనం ఒకనిర్ణయానికి వచ్చేముందు ఆ ఇద్దరి శక్తి సామర్థ్యాలనూ పరీక్షించాలి కదా!'' అన్నాడు రాజు ఆలోచిస్తూ.

''చిత్తం, అలాగే! పరీక్షించిన తరవాతే ఒక మంచి నిర్ణయం తీసుకోండి,'' అన్నది రాణి.

రాజు ఆశించినఅవకాశం త్వరలోనేవచ్చింది. మరకత పట్టణంలో సంపన్నుడైన ఒక వజ్రాల వ్యాపారి ఉన్నాడు. ఆయన ఏకైక కుమార్తె చారులతసౌందర్యరాశి. యుక్తవయస్కురాలు కాగానే, ఆమెను వివాహమాడడానికి ముగ్గురు యువకులు వచ్చారు. రూపంలోనూ, విద్య లోనూ, వ్యాపారదక్షతలోనూ ఒకరికొకరు తీసి పోయినవారు కాదు. ముగ్గురూ సమఉజ్జీలు. ఆ ముగ్గురిలో తన కుమార్తెకు తగిన వరుడు ఎవరని వ్యాపారి నిర్ణయించలేకపోయాడు. అప్పుడాయనకు పట్టణ సమీప అరణ్య

ప్రాంతంలో ఉన్న జ్ఞానానందముని జ్ఞాపకం వచ్చాడు. ఆ ముని అంటే వ్యాపారికి అపరిమిత మైనగౌరవ మర్యాదలు ఉండేవి. ఆ ముగ్గురిలో ఒకరిని తన కుమార్తెకు వరుడిగా నిర్ణయించే భారాన్ని మునిపై మోపి, ముగ్గురు యువకులనూ ఆయన దగ్గరికి పంపాడు.

వాళ్ళు ముని ఆశ్రమానికి వెళ్ళి వ్యాపారి పంపిన సంగతి చెప్పారు. ముని ముగ్గురు యువకులనూ ఒకసారి తేరిపార చూశాడు. మౌనంగా ఆశ్రమం లోపలికి వెళ్ళి మూడు శంఖాలను తెచ్చి, ముగ్గురు యువకులకూ ఇచ్చాడు. ఒక శంఖం నిండుగా మట్టీ, రెండవ శంఖం నిండుగా నీళ్ళూ, మూడవ శంఖంలో ధాన్యపు గింజలూ ఉన్నాయి.

మూడు శంఖాలతో తిరిగి వచ్చిన ముగ్గురు యువకులను చూసి, వ్యాపారి, ముని ఎవరిని తన కుమార్తెకు తగిన వరుడిగా సూచించాడో గ్రహించలేకపోయాడు. చాలాసేపు ఆలోచించిన తరవాత, ఆయన ముగ్గురు యువకులనూ వెంటబెట్టుకుని రాజాస్థానానికి వెళ్ళి, వర నిర్ణయంలో రాజుగారి సాయం అర్థించాడు.

ఆ మూడు వస్తువులను పంపడంలో ముని ఆంతర్యం ఏమై ఉంటుందో చెప్పమని రాజు ముగ్గురు యువకులనూ అడిగాడు.

''ప్రభూ! మట్టితో నింపిన శంఖం నాకు ఇచ్చాడు. మట్టి లేకుండా నీళ్ళ వల్లా, ధాన్యపు గింజల వల్లా ఎలాంటి ప్రయోజనమూ ఉండదు. ఈ మూడింటిలో మట్టిలాగా మా ముగ్గురిలో నేనే అధికుడననీ, తగిన వరుణ్ణనీ దీనిద్వారా ముని సూచించాడు,'' అన్నాడు మొదటి యువకుడు.



''మహారాజా! నీళ్ళు లేకుండా మట్టీ, గింజలూ నిష్ప్రయోజనం కదా! నీళ్ళే ప్రాణాధారం. అలాంటి విలువైన జలం నిండిన శంఖాన్ని నాకు ఇచ్చాడు గనక తగిన వరుడిగా ముని నన్నే సూచించాడని భావిస్తున్నాను,'' అన్నాడు రెండవవాడు.

మూడవ యువకుడు, ''ధాన్యం పండడానికి కావలసిన అనుకూలమైన పరిస్థితుల్ని మట్టీ, నీరూ కల్పిస్తాయి. అయితే, ఇక్కడ ప్రధానమైనది పంట మాత్రమే. ఈ మూడింటిలో ప్రధానమైన ధాన్యపు గింజలు నింపిన శంఖం నాకిచ్చి పంపడంవల్ల నేనే తగిన వరుణ్ణని ముని మనోభావం, అన్నది ప్రభువులకు తెలియనిది కాదు,'' అన్నాడు వినయంగా.

ముగ్గురి అభిప్రాయాలూ యుక్తియుక్తంగానే ఉన్నట్టు రాజుకు అనిపించింది. ఇప్పుడు



రాజుకు ఒక ఆలోచన వచ్చింది. సలహాదారు పదవికి పోటీపడుతూన్న ఇద్దరు అభ్యర్థుల తెలివితేటల్నీ, వివేకాన్నీ పరీక్షించడానికి ఇదొక అద్భుత అవకాశం అనిపించింది. అదృష్టం కొద్దీ, మణిభద్రుడూ, విశ్వబంధూ అప్పుడు సభలోనే ఉన్నారు.

రాజు విశ్వబంధుకేసి తిరిగి, "ఈ విషయంలో నీ అభిప్రాయం ఏమిటి?" అని అడిగాడు.

"మూడింటిలో జలం ప్రధానమైనదని నేను భావిస్తున్నాను. మట్టినీ, ధాన్యాన్నీ ఉపయోగకరంగా మార్చేది జలం. జలం లేకుండా మిగిలిన రెండింటివల్లా ఎలాంటి ప్రయోజనమూ ఉండదు," అన్నాడు విశ్వబంధు.

"నీ అభిప్రాయం కూడా చెప్పు," అన్నాడు రాజు, మణిభద్రుడికేసి చూస్తూ.

"మహాప్రభూ! నా అభిప్రాయం వెలిబుచ్చే ముందు, ఆ మూడు వస్తువులనూ స్వయంగా పరిశీలించాలి," అన్నాడు మణిభద్రుడు.

రాజు అందుకు అనుమతించాడు.

మణిభద్రుడు నీళ్ళను ఒకచుక్క నోట్లోవేసుకుని రుచి చూశాడు. మట్టిని వాసనచూశాడు. ధాన్యపు గింజలను వేళ్ళతో పరిశీలించి చూసి, రాజుకేసి తిరిగి, "మహాప్రభూ! మట్టితో నింపిన శంఖాన్ని పొందిన యువకుడే తగిన వరుడు అన్నది ముని మనోగత భావం!" అన్నాడు.

ఈ ఇద్దరి అభిప్రాయాలు కూడా రాజు సమస్యను పరిష్కరించలేకపోయాయి. ఎవరి అభిప్రాయం సరైనది? అన్న సందిగ్ధంలో పడ్డాడు. ఆఖరికి ముని ద్వారానే సమస్యను పరిష్కరించడం ఉత్తమమని భావించాడు.

రాజుగారి ప్రార్థనమేరకు ముని మరునాడు రాజాస్థానానికి వచ్చి, ఆయన సమస్యను విన్నాడు. ఆ తరువాత, "రాజా! అసలైనమణులు చాలా అరుదైనవి! అలాంటి మణి నీ ఆస్థానంలోనే ఒకటి ఉన్నది. నీ క్షేమం, రాజ్యక్షేమం కాంక్షించి, దానినిగుర్తించు!" అన్నాడు ప్రశాంత వదనంతో మందహాసం చేస్తూ.

మార్తాండవర్మ ఆశ్చర్యంతో మునికేసి చూశాడు. ఆయన మాటలను అర్థం చేసుకున్నాడు. ఆనందంతో తన సలహాదారును నిర్ణయించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా! ముని ఎప్పుడూ గూఢంగానే మాట్లాడుతున్నది తేటతెల్లం. ముని మాటల నుంచి రాజు అర్థం చేసుకున్నదేమిటి? ముని అంతర్యం అర్థం చేసుకోకుండానే తొందరపాటుతో సలహాదారును నియమించాడా? ఎవరిని ఆ ఇద్దరిలో సలహా

దారుగా నియమించాడు? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''రాజు మార్తాండ వర్మ పరమ వివేకి. ముని తగిన వరుణ్ణి సూచించిన విధానంలోనూ, ముగ్గురు యువకుల యుక్తియుక్తమైన సమాధానాలవల్లా మొదట రాజు సందిగ్ధంలో పడినమాట వాస్తమే. అయితే, తాను సలహాదారుగా నియమించాలనుకున్న వ్యక్తులను, ఆ సమస్యను పరిష్కరించమని చెప్పడంలో రాజు చాలా సమయస్ఫూర్తిని ప్రదర్శించాడు. అయితే, వారిద్దరిలో ఎవరిది సరైన సమాధానం అని నిర్ణయించలేని స్థితిలో ముని సాయం అర్థించాడు.

వ్యాపారి కుమార్తెకు తగిన వరుణ్ణి సూచించిన ముని, తన సలహాదారుగానూ తగిన వ్యక్తినే సూచించగలడని రాజు విశ్వసించాడు. ముని తన సహజ ప్రవృత్తి కారణంగా మళ్ళీ నిగూఢంగానే మాట్లాడాడు. అయితే, ఈసారి రాజు ముని ఆంతర్యాన్ని అర్థం చేసుకున్నాడే తప్ప, తొందరపాటుతో నిర్ణయానికి రాలేదు. ముని అసలైన మణుల ప్రస్తావన తెచ్చినప్పుడే అది మణిభద్రుణ్ణి గురించేనని రాజు స్పష్టంగా గ్రహించాడు.

మిగిలినవారందరూ ముగ్గురు యువకులనూ, వాళ్ళు తెచ్చిన శంఖాలనూ చూశారే తప్ప, మణిభద్రుడిలా శంఖాలలోని వాటిని జాగ్రత్తగా పరిశీలించలేదు. ముగ్గురు యువకులూ, తగిన వరులులాగా కనిపించినట్టే–మట్టీ, నీరూ, ధాన్యపుగింజలు కూడా పైపైకి సమానమైన ప్రాధాన్యత కలవిగా కనిపించాయి. అయితే వాటిని పరీక్షించి చూసినప్పుడే వాటిలోని గుణదోషాలు తెలిసి ఉండవచ్చు. నీళ్ళు ఉప్పగా, ధాన్యంలో ఊక ఎక్కువగా ఉండి ఉండవచ్చు. మట్టి స్వచ్ఛంగా కమ్మని వాసనతో కనిపించి ఉండవచ్చు. అందువల్లే మణిభద్రుడు అంతటి ఆత్మవిశ్వాసంతో ముని మనోగతభావాన్ని వెల్లడించగలిగాడు. అందుకే రాజు అతన్ని తన సలహాదారుగా నియమించాడు. ఇందులో రాజు తొందరపాటు అంటూ ఏమీ లేదు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)



# క్రిస్మస్!



డిసెంబర్ నెల రాగానే ఆనందం, ఉత్సాహం, జేగంటలు, శాంతా క్లస్, కానుకలు, కేకులు అంటూ క్రిస్మస్‌హడావుడి మొదలవుతుంది.

డిసెంబర్ 25 ప్రపంచవ్యాప్తంగా ఎంతో ప్రాముఖ్యతను సంతరించుకున్న రోజు. మానవప్రేమను ప్రబోధించిన కరుణామూర్తి ఏసుక్రీస్తు జన్మదినం అది. ఆయనేక్రైస్తవ మతాన్ని స్థాపించాడు.

క్రిస్మస్ పరస్పర ప్రేమాభిమానాలు పంచుకునే పర్వదినం. ఆనందోత్సాహాలు వెల్లివిరిసే సమయం. మనదేశంలోని క్రైస్తవులు ఆయా ప్రాంతాల ఆచార సంప్రదాయాలకు అనుగుణంగా ఈ పండుగను జరుపుకుంటారు. ప్రతి ఇంటినీ శుభ్రపరచి దీపాలతో అలంకరిస్తారు. ఇళ్ళల్లోనూ, షాపుల్లోనూ క్రిస్మస్ చెట్టును నక్షత్రాలతోనూ, బెలూన్లతోనూ రంగురంగుల కాగితాలతోనూ అలంకరిస్తారు. ఏసుక్రీస్తు జన్మఘట్టాన్ని చిత్రించే దృశ్యాన్ని బొమ్మలతో కొందరు తయారు చేస్తారు.

క్రైస్తవులు తమ ఇంటిముందు వివిధ వర్ణాల నక్షత్రాకార కాగితం బొమ్మలను తయారుచేసి వేలాడదీస్తారు. కొన్ని గ్రామాలలో ఎవరి ఇంటి ముందున్న నక్షత్రం ఎక్కువ ఎత్తులో ఉందో అని పోటీలుకూడా జరుపుతారు. దక్షిణభారత ప్రాంతంలో వెదురు దబ్బలతో దీపాలు తయారు చేసి వాటిలోపల బల్బులు అమర్చుతారు. వీటిని ఇళ్ళగుమ్మాలముందు వేలాడదీస్తారు.

క్రిస్మస్ సందర్భంగా ఏసుక్రీస్తు మీద భక్తిగీతాలు ఆలపిస్తూ బృందాలుగా భక్తులు ఇంటింటికీ వెళతారు.

క్రిస్మస్ రావడానికిముందే అంటే డిసెంబర్ ఇరవైనాలుగు అర్ధరాత్రి సమయంలో చర్చ్‌లలో ప్రార్థనలుజరుపుతారు. ఏసుక్రీస్తుప్రేమసందేశాన్ని స్మరించుకుంటారు. ప్రార్థనలు పూర్తి అయ్యాక బంధుమిత్రులను కలుసుకుని కానుకలు ఇస్తారు. కుటుంబసభ్యులందరూ కలిసి విందు భోజనం చేయడంతో పండుగసంబరం పూర్తవుతుంది. రుచికరమైన క్రిస్మస్ కేక్ లేకుండా క్రిస్మస్ వేడుకలు సమాప్తం కావు. సంప్రదాయానుసారం కొందరు రకరకాల పళ్ళతోనూ, ఇంట్లో తయారు చేసిన వైన్‌తోనూ ఈ కేక్‌ను తయారుచేసుకుంటారు!

# క్రిస్మస్ చెట్టును తయారుచేద్దాం!

హల్లెలూయా! సంవత్సరంలో అతి పవిత్రమైనదీ, అత్యంత ఆనందకరమైనదీ అయిన రోజు వచ్చేసింది. ఆనందంగా బంధుమిత్రులను కలుసుకోవడానకీ, బహుమతులు ఇచ్చిపుచ్చుకోవడానికీ దోహదంచేసే వేడుక రోజులు వచ్చేశాయి. ఈ యేడు మీ ఇంటిని మీ బుల్లి చేతులతో తయారుచేసిన క్రిస్మస్ చెట్టుతో అలంకరించండి. మీరు చేయవలసిందల్లా కత్తెరనూ, గమ్ బాటిల్‌నూ అందుకోవడమే. సూచనలను జాగ్రత్తగా చదివిన తరవాతే కార్యరంగంలోకి దిగాలన్న విషయం గుర్తుంచుకోండి!

1. ఈ పేజీని కత్తిరించి ఒక కార్డుబోర్డు మీద అతికించి, ఇందులోని బొమ్మలనువిడివిడిగాకత్తిరించుకోండి.
2. ఎ చెట్టు అడుగుభాగంలోనూ బి చెట్టు ఎగువ భాగంలోనూ పటంలో చూపినవిధంగా నిలువుగా చీటలా కత్తిరించండి.
3. ఎ చెట్టు కట్‌అవుట్‌ను, బి చెట్టు కట్ అవుట్‌తో చేర్చి ఒకదానిలో ఒకటి జొరబడేలా చేయండి.
4. చెట్టు చివర నక్షత్రాన్ని అమర్చండి.
5. చెట్టును మీకునచ్చిన రంగులబంతులతో, క్యాండీ స్టిక్స్‌తో అలంకరించండి. వాటిని అతికించడానికి జిగురును వాడండి.

ఆహా! అందమైన, ఆకర్షణీయమైన క్రిస్మస్ చెట్టు! అవునా? ఇప్పుడు తీసుకెళ్ళిషోకేస్‌లో అమర్చండి!



# ఈద్-ఉల్-ఫితిర్



ఈద్-ఉల్-ఫితిర్ సందర్భంగా మనకు తరచూ వినిపించే శుభాకాంక్షలు—'ఈద్ ముబారక్' అనే మాటలు! ముస్లిం పండుగలలోకెల్లా చాలా ఆకర్షణీయమైనది 'రంజాన్ ఈద్' అని అంటారు. ముస్లిం నెల రమదాన్ చివర ఈ పండుగ వస్తుంది. పవిత్ర మాసంగా భావించబడే ఈ రమదాన్ నెలలో వచ్చే అమావాస్యకు మరునాడు ఈ పండుగను జరుపుకుంటారు. ఈ యేడు డిసెంబర్ 17వ తేదీ ఈ పండుగ వస్తున్నది!

ఈ నెలలో ముస్లింలు పగలంతా ఉపవాసం చేస్తారు. సూర్యోదయానికి ముందే భోజనం ముగించి, సూర్యుడు అస్తమించాక చంద్ర దర్శనం చేసుకున్న తరవాతే ఉపవాసం విరమిస్తారు. పగటిపూట పచ్చి మంచినీళ్ళుకూడా ముట్టుకోరు!

ఈద్ రోజున బంధుమిత్రులు పరస్పరం శుభాకాంక్షలు తెలియజేసుకుంటారు. అందరూ కలిసి ప్రార్థనలు జరుపుతారు. ఈ ప్రార్థనా సమావేశాలు పెద్దవిగా ఉండడం వల్ల, సాధారణంగా బహిరంగ ప్రదేశాలలోనే జరుపుతారు!

మత గురువైన ఖాజీని ప్రార్థనా స్థలానికి ఊరేగింపుగా తీసుకువెళతారు. ప్రార్థనానంతరం ఆయన ఉపన్యసిస్తాడు. ఆ తరవాత బంధుమిత్రులను కలుసుకోవడంతో రోజంతా ఆనందంగా గడుపుతారు.

ఈద్ సందర్భంగా ముస్లింలు పేదవారికి (ఫితిర్)దానాలిస్తారు. గోధుమ లేదా ఏదైనా ధాన్యం, ఖర్జూరం, ద్రాక్ష ఈ దానం(ఫితిర్)లో ముఖ్యంగా ఉంటాయి. ప్రార్థనా సమావేశానికి హాజరయ్యే ముందు ప్రతి ముస్లిం విధిగా దానంచెయ్యాలి.

రమదాన్ నెల ఇరవై ఒకటి, ఇరవై రెండు తేదీలలో షియాతెగ ముస్లింలు సంతాపం పాటిస్తారు. ప్రవక్త మహమ్మదు అల్లుడు అలీ ప్రాణ త్యాగానికి గుర్తుగా ఆరోజు సంతాపం పాటిస్తారు.

ఈ రమదాన్ నెలలోనే పవిత్ర ఖురాన్ దివి నుంచి భూమి మీదికి వచ్చిందని విశ్వసిస్తారు. ఈ పవిత్ర మాసం ఆఖరు పది రాత్రులలోనే ఖురాన్ బహిర్గతమయిందని చెబుతారు. ఈ రాత్రులను లైలుత్-ఉల్-కదర్ అంటే, 'శక్తిమయరాత్రులు'గా జరుపుకుంటారు. ఈ పవిత్ర ఖురాన్ ఎప్పుడు బహిరంగపరచబడిందన్నది ఒక్క అల్లాకూ, ప్రవక్తకూ మాత్రమే తెలుసుననికూడా విశ్వసిస్తారు.

# కార్తీక దీపం!



దక్షిణభారతదేశంలో ముఖ్యంగా తమిళనాడులో జరుపుకునే దీపాలపండుగ కార్తీక దీపం. కార్తీకమాసం పౌర్ణమి రోజున ఈ పండుగ వస్తుంది. ఈ యేడు నవంబర్ 30 వ తేదీన వస్తున్నది. ఈ పండుగను మూడు రోజులపాటు జరుపుకుంటారు.

పంచభూతాలకు అంటే భూమి, నీరు, గాలి, నిప్పు, ఆకాశం—అధినాధుడైన పరమ శివుడు ఐదుచోట్ల అయిదు భూతాలుగా వెలిశాడని పురాణాలు పేర్కొంటున్నాయి.

అరుణాచలంలో అంటే తిరువణ్ణామలైలో అగ్నిస్వరూపంగా వెలిశాడట. యేటా కార్తీక మాసం భరణీ నక్షత్రం రోజున ఆలయంలో విశేష పూజలు జరిపి ఈ కొండమీద దీపం వెలిగించి, ఘనంగా ఉత్సవం జరుపుతారు.

వర్షాకాలంపూర్తికావడాన్నిపురస్కరించుకుని కూడా ఈ పండుగ జరుపుతారని చెబుతారు.

కార్తీకమాసం ఆరంభం నుంచే స్త్రీలు తెల్లవారకముందే లేచి స్నానంచేసి నట్టింట ప్రమిద దీపాలు వెలిగిస్తారు. కార్తీకదీపం రోజున ప్రతి ఇంటా ఘనంగా పూజలు చేస్తారు. ఇంటిని దీపాలతో అలంకరిస్తారు. మేళతాళాలతో వెళ్ళి ఆలయ గోపురాల మీదా, చెరువుల్లో, బావుల్లో కూడా దీపాలు పెట్టే ఆచారం ఉన్నది. కొన్ని కుటుంబాలలో ఈరోజు తెల్లవారగానే బియ్యం పిండి, బెల్లం కలిపి చేసిన ప్రమిద దీపాలలో నెయ్యిపోసి నట్టింట వెలిగిస్తారు. దీపపూజ చేసి దేవుణ్ణి అర్చిస్తారు.

పిల్లలు, దీపావళికి కాల్చగా మిగిలిన బాణాసంచా పేలుస్తారు!

దీపం జ్ఞానానికి సంకేతం. జ్ఞానాన్ని దైవ స్వరూపంగా భావించే సంప్రదాయం మనది. దానికి ఒక చక్కని ఉదాహరణ కార్తీకదీపం!



# కరుణ కనుచూపు

చాలాకాలం కిందట మహారాష్ట్ర ప్రాంతంలోని ఒక చిన్నగ్రామంలో ప్రదీపుడనే ఏడేళ్ళ పసివాడు ఉండేవాడు. వాడి తండ్రికి తప్ప ఆ గ్రామంలో వాడంటే అందరికీ ఎంతో ఇష్టం. "గుడ్డి వెధవా! నిన్ను పెంచి పోషించడంవల్ల నాకు ఒరగబోయే దేమిటి?" అంటూ మాటిమాటికీ వాణ్ణి తండ్రి కసురుకునేవాడు. "నీకు ఏ ఒక్క పనీ చేతకాదు. వెళ్ళి ఎక్కడైనా అడుక్కుని నీ పొట్టపోసుకో!" అంటూ తిట్టి ప్రదీపుడి తండ్రి, వాణ్ణి ఒకనాడు ఇంటినుంచి తరిమేశాడు.

ఇక చేసేదిలేక ప్రదీపుడు తన బతుకు తెరువు వెతుక్కుంటూ విశాల ప్రపంచంలో అడుగు పెట్టాడు. వాడికి తోడుగా వాడి కుక్క మోతీ మాత్రమే ఉంది. అది చాలా విశ్వాసం గలది. వాడూ, కుక్కా కలిసి వీధుల వెంట తిరుగుతూ, పాటలు పాడుకుంటూ బిచ్చ మెత్తుకుని దొరికింది తింటూ కాలం గడప సాగారు. ఇలా ఐదేళ్ళ కాలం గడిచిపోయింది. వాళ్ళు గ్రామం నుంచి చాలా దూరం వచ్చేశారు.

ఒకనాడు సాయంకాలం వరకు తిరిగి తిరిగి, తెచ్చుకున్న ఆహారాన్ని కూడా తినడానికి శక్తిలేక ప్రదీపుడు ఒక దేవాలయం మెట్లవద్ద చతికిలబడ్డాడు. "మోతీ! నాకా చూపులేదు. నీ సాయంతో రోజంతా తిరిగితిరిగి అలిసిపోయాను. నాకే గనక చూపువస్తే ఎంత బావుండేది! కొంత సేపు సేదతీరాక అన్నం తిందాం!" అంటూ మెట్ల మీద పడుకున్నాడు. యజమాని విచారం గ్రహించి కుక్క ఎంతో బాధపడింది. ఆప్యా యంతో అతడి కాళ్ళు నాకింది. ఆ తరవాత పక్కనే పడుకున్నది. ప్రదీపుడు కుక్కమీద చేయి వేసుకుని అలాగే ఆదమరిచి నిద్రపోయాడు.



ప్రదీపుడికి ఒక వింతకల వచ్చింది. ఒక అందమైన దేవత వాణ్ణి సమీపించి, "ప్రదీపా! నన్ను చూడు!" అన్నది.

"అదేతల్లీ నాకు సాధ్యంకానిది! నేను గుడ్డివాణ్ణి," అన్నాడు ప్రదీపుడు దీనంగా.

దేవత మందహాసం చేస్తూ, "విచారించకు ప్రదీపా! నీకు నేను సాయంచేస్తాను. నువ్వు మంచిపని చేసిన ప్రతి ఒక్కసారీ, నీ కళ్ళలోకి కొంత వెలుగు ప్రవేశించి కొద్దిగా

చూడగలుగుతావు. అయితే, ఏదైనా చెడ్డపని చేశావో, దానికి తగ్గట్టు నీ కళ్ళల్లో మెలుగు తగ్గిపోయి, అంధుడివైపోతావు," అని చెప్పి మాయమయింది.



ప్రదీపుడు ఉలిక్కిపడి లేచాడు. తన మనసెందుకో సంతోషంతో పొంగి పోతున్నది. కుక్కకూడా ఉత్సాహంతో గెంతుతున్నది. "రా, మోతీ! తిందాం!" అంటూ ప్రదీపుడు కుక్కకూ పెట్టి, తానూ ఇంత తిన్నాడు.

మరునాడు తెల్లవారింది. కలలో దేవత మాటలు తలుచు కుంటూంటే ప్రదీపుడి ఊహలకు రెక్కలు రాసా గాయి. "ఈ ప్రపంచాన్నీ, అందులోని అందచందాలనూ చూడబోతున్నాను," అను కున్నాడు అనేకసార్లు. ఇద్దరూ ఎప్పటిలా బయలుదేరారు.

దారిపక్కన చెట్టుకింద కూర్చున్న గుడ్డి బిచ్చగాడొకడు వాళ్ళకు తారసపడ్డాడు. వాడు మరీ ముసలివాడు. "అయ్యా, గుడ్డివాణ్ణి! ధర్మం చెయ్యండి బాబూ!" అంటున్నాడు.

"నేనూ కళ్ళులేని పేదవాణ్ణే!" అన్నాడు ప్రదీపుడు వాడికి సాయం చేయలేకపోతున్నామే అన్న బాధతో.

"నీకు కళ్ళు లేవుగానీ, కాళ్ళున్నాయి కదా నాయనా! నాకు కాళ్ళూ లేవు," అన్నాడు ముసలివాడు దీనంగా.

ఆమాట వినగానే ప్రదీపుడు తన జేబులో వున్న ఒకే ఒకరూపాయి నాణెంతీసి ముసలి వాడికిచ్చాడు. ముసలివాడు ఆనందంతో, "దేవుడు నిన్ను కరుణిస్తాడు, బాబూ!" అన్నాడు.

ప్రదీపుడికి ఉన్నట్టుండి కళ్ళల్లో మెరుపు మెరిసినట్టయింది. వాడు వెంటనే కళ్ళు మూసు కుని కొంతసేపయ్యాక మెల్లగా తెరిచాడు. కళ్ళె దుట మునుపటి కటికచీకటి లేదు. ఏదో మసక మసకగా కనిపిస్తోంది. "మోతీ! కల నిజమవు తోంది! నేనిప్పుడు ఒక చిన్న మంచిపని చేశానా, అంతలోనే కొద్దిగా చూపు వచ్చినట్టనిపిస్తోంది," అని కేకవేశాడు ప్రదీపుడు ఆనందం పట్టలేక.

ఆ రాత్రి ప్రదీపుడూ, కుక్కా ఒక ముసలి బిచ్చగత్తెను చూశారు. "ఆకలి బాబూ! ధర్మం చెయ్యండి," అన్నది బిచ్చగత్తె. కొన్నాళ్ళుగా తమ కని దాచుకున్న ఎండిపోయిన రొట్టె ముక్కను తీసి ఆమెకిచ్చాడు ప్రదీపుడు. ఆమె దానిని తీసుకుంటూ, నీళ్ళు నిండిన కళ్ళతో, "దేవుడు నిన్ను చల్లగాచూడాలి, బాబూ," అంటూచేతులెత్తి దణ్ణంపెట్టింది. మళ్ళీ వింతకాంతి ఏదో ప్రదీపుడి కళ్ళల్లోకి ప్రవేశించినట్టయింది. వాడామెను, "వెన్నెల కాస్తోందా?" అని అడిగాడు. "అవును, ఈరోజు పౌర్ణమి, బాబూ!" అన్నదా ముసలిది. "ఆహా! చందమామను చూడగలుగుతున్నాను," అనుకున్నాడు ప్రదీపుడు తనలో తాను.



చూద్దాం," అంటూ బాధగా వెనక్కు తిరిగి నడిచి ఆ కోడి వాళ్ళకు దొరికిన చోటికి చేరాడు. "పొద్దున కోడి ఎవరిదైనా కనిపించకుండా పోయిందా?" అని చుట్టుపక్కల విచారించాడు.

"అవును, మా తమ్ముడి కోడి కనిపించలేదు. వాడు నిరుపేదవాడు. కోడి కనిపించలేదని చాలా బాధపడుతున్నాడు," అన్నాడు అటుకేసి వచ్చిన ఒక పెద్దమనిషి. ఆయన ఆ మాట పూర్తిచేయకముందే ప్రదీపుడు తన జేబులోని డబ్బు తీసి, "పొద్దున నా కుక్క ఆ కోడిని పట్టుకొచ్చింది. దానిని అమ్మగా వచ్చిన డబ్బు ఇది. దీనిని మీ తమ్ముడికి చేర్చండి," అంటూ ఆయన చేతికిచ్చి వెనుదిరిగాడు. ఆ క్షణమే వాడి కళ్ళల్లోకి మళ్ళీ వెలుగు ప్రసరించింది. కడుపు నకనకలాడుతున్నప్పటికీ వాడి కళ్ళల్లో సంతోషం మిలమిలలాడింది!

మరునాడు తెల్లవారేసరికి వాడికీ, కుక్కకూ ఆకలి మండిపోతోంది. "రా, మోతీ! ఏ పుణ్యాత్ముడైనా ఇంత పెడతాడేమో చూద్దాం!" అంటూ కుక్కను వెంటబెట్టుకుని బయలుదేరాడు. ఇద్దరూ మట్టిబాట గుండా వెళుతున్నప్పుడు ఉన్నట్టుండి అటుమైపు ఎగురుతూ వచ్చిన కోడిని తరుముకుంటూ మోతీ పరిగెత్తింది. మరికొంత సేపటికి కోడిని నోట కరుచుకుని తిరిగి వచ్చింది. ప్రదీపుడు ఆనందంతో ఆ కోడిని తీసుకుని వెళ్ళి అంగడి వీధిలో అమ్మాడు. అమ్మగా వచ్చిన ఆ డబ్బులో కొంతపెట్టి ఫలహారం కొనుక్కుని తినడానికి ఒకచోట కూర్చున్నాడు. ఆ క్షణమే వాడి కళ్ళల్లోని వెలుగు మాయమయింది. కారుమేఘం కమ్ముకున్నట్టు కటిక చీకటి! ప్రదీపుడికి విషయం అర్థమయింది. "మోతీ! నా కళ్ళల్లో వెలుగు తగ్గిపోయింది. మనదికాని కోడిని అమ్మేసి, తప్పు చేశాం. రా, దీనికేదైనా పరిహారం ఉందేమో

మరికొన్ని వారాలపాటు మంచి పనులే చేయడంవల్ల, వాడి కళ్ళల్లో చూపు పెరుగుతూ వచ్చింది. ఇది పగలు, ఇది రాత్రి అనే తేడా పసిగట్టడంతోపాటు వస్తువులను కూడా చూచాయగా గుర్తించగల స్థితికి వచ్చాడు. ఒకనాడు వాడు మోతీతో ఏటిగట్టున నడుస్తున్నాడు. "నా కళ్ళు రోజురోజుకూ మెరుగవుతున్నాయి. నువ్వు నాకు అమూల్యమైన సాయం చేస్తున్నావు మోతీ!" అంటూ ఆప్యాయంగా కుక్క వీపు నిమిరాడు.

ఉన్నట్టుండి దూరంనుంచి ఏడుపు కేక వినిపించింది. "కాపాడండి! కాపాడండి! మునిగిపోతున్నాను," అంటూ ఎవరో కేకలు పెడుతున్నారు. ప్రదీపుడికి ఏం చెయ్యాలో తోచలేదు. చూపు సరిగా ఆనని తాను ఎలా నీళ్ళలో

మునిగిపోతూన్న మనిషిని కాపాడగలడు? మోతీ బాగా ఈదగలదు. అయినా అది ప్రమాద వశాత్తు మునిగిపోతే తనగతి ఏం కాను? అది లేకుండా తను బతకగలడా?

మళ్ళీ మునిగిపోతూన్న మనిషి కంఠస్వరం దీనంగా వినిపించింది. "మోతీ! వెళ్ళి కాపాడు!" అన్నాడు ప్రదీపుడు దాని వీపు తట్టి. ఆ క్షణమే కుక్క నదికేసి శరవేగంతో పరిగెత్తింది.

ప్రదీపుడు కూడా దాని వెంట వెళ్ళాడు. కొంతసేపటికి వాడికి ఏటిగట్టున ఒక మనిషి రొప్పుతూ కనిపించాడు. "నువ్వు గట్టెక్కావా?" అని అడిగాడు ప్రదీపుడు అతన్ని సమీపిస్తూ.

"కుక్క నా ప్రాణం కాపాడింది. అయితే, దాన్ని నేను కాపాడలేక పోయాను నాయనా," అన్నాడు అతడు బాధతో నిట్టూరుస్తూ.

మోతీ! మిత్రమా! నువ్వు లేకుండా నేనెలా బతగ్గలను," అంటూ ప్రదీపుడు నెత్తీ నోరూ బాదుకుంటూ ఏడ్వసాగాడు.

ఆ మనిషి ప్రదీపుణ్ణి రెండు చేతు లతో పట్టుకుని ఓదార్చుతూ, "ఏడవకు, బాబూ! మీనాన్న నీకు వేరొక కుక్క పిల్లను కొనిపెడతాడులే," అన్నాడు.

"నాకు నాన్న లేడు. నేను చూపులేనివాణ్ణని ఏడేళ్ళ వయసులోనే నన్ను ఇంటినుంచి వెళ్ళ గొట్టాడు!" అన్నాడు ప్రదీపుడు.

ఆ మాట వినగానే, "నువ్వు ప్రదీపుడివా?" అని అడిగాడు ఆ మనిషి ఆశ్చర్యంగా.

ప్రదీపుడు అతన్ని పరిశీలనగా చూశాడు. అవును! అతడు తన తండ్రే. అంతేకాదు; తను ఇప్పుడు బాగా చూడగలుగుతున్నాడు. వాడు చేసిన చివరి మంచిపని వాడి అంధత్వాన్ని పూర్తిగా పోగొట్టింది! తండ్రి కొడుకుకేసి ఆనందంతో చూశాడు. అతని ముఖంలో పశ్చాత్తాపం కనిపించింది. ఆయన, "నన్ను క్షమించు నాయనా! నాతో ఇంటికి తిరిగి రా! నీకు చూపు తెప్పించడానికి చేయగలిగిందల్లా చేస్తాను," అన్నాడు. అప్పుడాయన ప్రదీపుడు తనను స్పష్టంగా చూడగలగడం గమనించాడు. "ఎలా? ఎలా సాధ్యమయింది?" అని అడిగాడు తండ్రి ఆతృతతో.



అప్పటికే తండ్రి చేసిన అపకారాన్ని మరిచి పోయిన ప్రదీపుడు, ఆయనకు జరిగిందంతా వివరంగా చెప్పాడు. ఇద్దరూ సంతోషంగా తమ ఇంటికేసి బయలుదేరారు.

ఆ తరవాత కొన్నాళ్ళకు ప్రదీపుడి దగ్గరికి మిన్నీ అనే మరొక కుక్కపిల్ల చేరింది. అయినా వాడు మోతీని మరువలేకపోయాడు. వాడికి మళ్ళీ చూపురావడానికి సాయపడిందే ఆ కుక్క పిల్ల కదా!

# హాస్యచతురులు: గోపాల్ భాండ్



గోపాల్ భాండ్ రాజా కృష్ణచంద్రుడి ఆస్థాన విదూషకుడు. రాజు ఒకనాడు విచారంగా ఉండడం గమనించి అయన కారణం అడిగాడు. "నవాబువల్ల వచ్చిన తంటానే మళ్ళీ!" అన్నాడు రాజా. "అదేమిటో నాకు చెప్పండి. సాయపడగలనేమో చూస్తాను," అన్నాడు గోపాల్.



"నవాబు నన్ను భూమిని ఈ చివరినుంచి ఆ చివరి వరకూ కొలవ మంటున్నాడు. అదే సమయంలో ఒక్కసారిగా నక్షత్రాలను లెక్కపెట్ట మంటున్నాడు!" అన్నాడు రాజు విచారంగా. "అంతేనా? దీనికెందుకు ఇలా దిగులుపడుతున్నారు. మీ గోపాల్‌కు అసాధ్యం అంటూ లేదు. మొదట లక్ష రూపాయల డబ్బుపుచ్చుకుని, ఆ పనిపూర్తిచేయడానికి ఒక సంవత్సరకాలం పడుతుందని నవాబుకు చెప్పండి," అన్నాడు విదూషకుడు.



రాజా విదూషకుణ్ణి వెంటబెట్టుకుని నవాబు దగ్గరికి వెళ్ళి సంగతి చెప్పాడు. "ఒక లక్ష రూపాయల డబ్బు సరే. ఈ పనులు పూర్తిచేయడానికి ఒక సంవత్సర కాలం ఎందుకు?" అని అడిగాడు నవాబు. "భూమినయితేరాత్రింబవళ్ళు నిర్విరామంగా కొలవగలనుగానీ, నక్షత్రాలు రాత్రుల్లోనేకదా కనిపిస్తాయి?" అన్నాడు విదూషకుడు.



రాజా చిన్నగా నవ్వడం గోపాల్ గమనించాడు. "అలాగే! ఇదిగో లక్ష రూపాయలు తీసుకో." అని డబ్బు ఇచ్చి, "అయినా నువ్వీపనిని నిజంగా ఒక సంవత్సరంలోగా పూర్తిచేయగలవా?" అని అడిగాడు నవాబు. "ఆ విచారం మీకు వద్దు ప్రభూ! ఒకసంవత్సరం తరవాత వచ్చి తమరిని దర్శించుకుంటాను," అన్నాడు గోపాల్.



ఆ తరవాత ఒక సంవత్సర కాలం హాయిగా గడుపుతూ తన క్షురక వృత్తిని కొనసాగించాడు. అతడు ఆస్థానానికి ఎందుకురావడం లేదా అని అందరూ ఆశ్చర్యపడ్డారు. అతన్ని అడిగారు కూడా. "అదా! మహారాజావారు నాకు ఒక మహత్కార్యం అప్పగించారు. అది పూర్తయ్యేంతవరకూ ఆస్థానానికి రానవసరంలేదు," అనేవాడు గోపాల్.





ఒక సంవత్సరం ముగిశాక గోపాల్, రాజా దగ్గరికి వెళ్ళి, "పని పూర్తయింది, మహాప్రభూ!" అన్నాడు. "భూమినంతా కొలిచావా? చుక్కలన్నిటినీ లెక్కించావా?" అని అడిగాడు రాజా నమ్మలేనట్టు. "చేశాను. రేపే నవాబు దర్శనానికి వెళదాం," అన్నాడు గోపాల్.



మరునాడు గోపాల్ సలహాప్రకారం నవాబు వారి దర్శనానికి రాజా ఊరేగింపుగా బయలుదేరాడు. రాజా గుర్రంమీదా, అతని వెనక పాదచారిగా విదూషకుడూ, ఆయన వెనక సన్నటి నూలుదారాలతో నింపిన పది ఎడ్ల బళ్ళూ, వాటివెనక బాగా గుబురు రోమాలతో వున్న పది గొర్రెలూ ఊరేగింపుగా నవాబు భవనం దగ్గరికి చేరాయి.



"నా తరఫున పని పూర్తిచేసుకుని వచ్చిన గోపాల్ భాండ్ ఇతడే!" అన్నాడు రాజా. "ఆహా! లెక్కలు చెప్పమనుమరి!" అన్నాడు నవాబు. "లెక్కలా? అవేమిటి? ఈ బళ్ళల్లో ఉన్న నూలు పొడవే ఈ భూమి చుట్టుకొలత! ఇక చుక్కలంటారా? ఈ పది గొర్రెల మీద ఉన్న రోమాలూ, చుక్కలూ సంఖ్యలో సరి సమానంగా ఉన్నాయి!" అన్నాడు గోపాల్. నవాబూ, రాజా నోటమాట రాక అలాగే నిలబడిపోయారు!

భారతీయ నృత్యాలు:

# మణిపురి




ఆభరణాల భూమిగా ప్రసిద్ధిగాంచిన మణిపూర్‌లో నాట్యం ఒక జీవన విధానంగానే కొనసాగుతున్నది.

ఈ ప్రాంతాలలో ఒకానొకప్పుడు, గంధర్వులనే దేవతలు నివసించేవారని చెబుతారు. మణిపూర్ ప్రజలు దివ్య లోకాలకు చెందిన తమ పూర్వుల నుంచే నాట్యాభిమానాన్నీ, నాట్య కళ అభిరుచినీ పుణికి పుచ్చుకున్నట్టు అనిపిస్తుంది.

ఈశాన్య భారతదేశంలో ప్రకృతి శోభతో నిండిన పర్వతాల మధ్య వెలసిన ఈ రమణీయమైన ప్రదేశంలాగే మణిపురి నృత్యం కూడా చాలా అందమైనది; ఆహ్లాదకరమైనది.

మణిపురి నృత్యం చాలా ప్రాచీనమైనదే అయినప్పటికీ దీనికి 20వ శతాబ్దంలో విశ్వకవి రవీంద్రనాథ టాగూర్ మంచి ప్రాచుర్యం కల్పించాడు. 1920 లో మచ్చింపూర్‌లో మొట్టమొదట ఈ నృత్యాన్ని చూసి రవీంద్రనాథ టాగూర్ పరవశించిపోయాడు. తాను నడుపుతూన్న శాంతి





నికేతన్‌లోని కళావిభాగంలో ఈ నృత్యాన్ని నేర్పేలా ఏర్పాటుచేశాడు.

జానపదం, శాస్త్రీయం, ఆధునికం ఇలా ఏ బాణీలోనైనాసరే మణిపురి నృత్యంలో భక్తి రసమే ప్రధానమైనది. మణిపురిలో చాలా ప్రసిద్ధమైన రాస–రాధాకృష్ణుల మధురమైన ప్రణయగాథను రసవత్తరంగా ప్రదర్శిస్తుంది.

మణిపురి నృత్యం కేవలం ఏకపాత్ర అభినయానికే పరిమితమైనది కాదు. బృంద నృత్యాలు కూడా ఉన్నాయి. డోల్ జాతర, హోలీవంటి స్థానికపండుగలప్పుడు ఈ బృంద నృత్యాలను ప్రదర్శిస్తారు.

బాలబాలికలు ఈ నృత్యాలలో ఉత్సాహంగా పాల్గొంటారు.

రాఖౌల్ నృత్యాన్ని మగపిల్లలు ప్రదర్శిస్తారు. ఇది శ్రీకృష్ణుడి బాల క్రీడలకు సంబంధించినది. ఆకర్షణీయమైన వస్త్రాలంకరణ సుతారమైన కదలికలతో నిండిన అందమైన ఈ నాట్యప్రదర్శనకు మరింత శోభను సమకూరుస్తుంది. లై–హరోబా సామూహిక నృత్యం. లైలా–మజ్ను; హీర్–రంఝాను పోలిన ఖోంభా - థోయిబీ ప్రేమకథను ఇది ప్రదర్శిస్తుంది.

మగపిల్లలు ప్రదర్శించే మణిపురినృత్యాలు కాస్త వేగంగా శక్తివంతమైన విన్యాసాలతో కనిపిస్తాయి. ఖోల్ అంటే మద్దెల శబ్దాల లయకు అనుగుణంగా నృత్య కారుల పాదాల కదలికలు ఉంటాయి.

మామూలుగా నృత్యాలకు శ్రావ్యంగా నేపథ్యగానం ఉంటుంది. తాళాలు, ఖోల్, ఏక్ తారను పోలిన సెనా సంగీత వాయిద్యాలను ఉపయోగిస్తారు. సంగీత లయలో, వేగంలో, శబ్దంలో ఎంతో వైవిధ్యం ప్రదర్శిస్తారు. మరీ తక్కువ స్థాయినుంచి శబ్దం అంచెలంచెలుగా ఎక్కువై తారాస్థాయిని చేరుకుంటుంది. మగపిల్లలు కొన్ని సమయాలలో ఖోల్, ఖంజారీ (తాళాలు) పట్టుకుని స్వయంగా వాయిస్తూ నృత్యం చేస్తారు.

ఓరాన్ జానపదకథ

## స్వస్థలం

మధ్య భారతదేశంలోని మధ్యప్రదేశ్, బీహార్, చట్టీస్‌ఘడ్, ఝార్ఖండ్, ఒరిస్సా, మహారాష్ట్ర మొదలైన ప్రాంతాలలో ఓరాన్ తెగ ప్రజలు విస్తరించి ఉన్నారు. ఒకానొకప్పుడు వీళ్ళు దక్షిణ భారతంలోని కొంకణ తీరంలో నివసించేవాళ్ళనీ, జనాభా పెరుగుదల కారణంగా ఉత్తర దిశగా తరలి వెళ్ళారనీ చెబుతారు.

ఓరాన్లు ద్రావిడ జాతికి చెందిన ముఖ్యమైన ఆదిమ తెగలలో ఒకదానికి చెందినవారుగా భావించబడుతున్నారు.

# నక్క తీర్పు!

ఓరాన్ యువకుడు జీతూ ఈలపాట పాడుకుంటూ అడవిదారి గుండా నదీతీరం కేసి నడవ సాగాడు. నదికి ఆవల 'బస్తీ'లో ఉన్న తనమామగారి ఇంటికి అతడు వెళుతున్నాడు. తన భార్య కార్మీనీ, కొడుకునూ రెండురోజుల క్రితమే అక్కడికి పంపేశాడు. తన బావమరిదికి బిడ్డ పుట్టాడు. వాళ్ళింట్లో 'ఛృతి' శుభకార్యం జరుగ నున్నది. అందులో పాలుపంచుకోవడానికే అతడిప్పుడు వెళుతున్నాడు. అలా నడిచి వెళుతూన్న జీతూ చూపులు, ఒకపొదనుంచి మరొక పొదలోకి వెళుతూన్న ఒకపెద్ద తాబేలు మీద పడ్డాయి.

"ఆహా! బ్రహ్మాండమైన వేట!" అను



కుంటూ ఆ క్షణమే తాబేలు మీద పడి రెండు చేతులతో దానిని వడిసి పట్టుకున్నాడు. అతి కష్టంమీద పైకి ఎత్తాడు. బాగా బలిసి ఉండడం వల్ల అది చాలా బరువుగా ఉంది. "కష్టపడితే మాత్రం ఏం? మంచి వేట దొరికింది. ఇప్పుడు మామగారి ఇంటికి కానుకతో వెళుతున్నాను గనక, మరి రెండు రోజులు ఉండి రావచ్చు," అనుకున్నాడు సంతోషంగా. కొంతసేపటికి అతడు నదీ తీరం చేరాడు. అతడున్న బస్తీకి ఆ నదీ తీరమే సరిహద్దు. ఆ బస్తీ చుట్టూ 'సర్నా' అడవి విస్తరించి ఉంది. అతడు ఇంకా కొంత ముందుకు వెళుతూ 'సర్నా బర్ఢీయా'కు మొక్కుకున్నాడు.

నదిని చూడగానే అతని గుండె గతుక్కుమన్నది. నది పొంగి రెండు గట్టులకూ ఆనుకుని నురగలతో అమిత వేగంగా ప్రవహిస్తున్నది. ఆవలిగట్టుకు చేరుకోవడం ఎలాగా? అని అతడు విచారంతో తీవ్రంగా ఆలోచించసాగాడు.

నది అంత లోతైనదికాదు. మామూలుగా మొలలోతు నీళ్ళల్లో నడిచే ఆవలికి వెళుతూ ఉంటారు. కాబట్టి పడవలూ, తెప్పకొయ్యలూ అక్కడ ఉండవు. జీతూ నిలబడి ఆలోచిస్తూండగా ఒక ఉపాయం తోచింది. తాను మోసుకు వచ్చిన తాబేలుకేసి చూశాడు. తాబేలు అతన్ని కోపంగా చూసింది.

"తాబేలూ! నన్ను ఆవలిగట్టుకు చేరుస్తావా? నది పొంగి ప్రవహిస్తోంది. దానిని దాటుకుని వెళ్ళలేను," అని ప్రేమ నటిస్తూ అడిగాడు జీతూ.

అతడి స్వరంలోని నటనను తాబేలు పసిగట్టింది. "ఈ మనుషులు క్షణాలలో ఎలా రంగులు మార్చేయగలరు? ఏమాత్రం నమ్మదగినవారు కారు. అయినా ఈ దుర్మార్గుడి నుంచి తప్పించుకోవడానికి ఇదొక మంచి అవకాశం. దీనిని జారవిడుచుకో కూడదు. వీడితో ఒక ఒప్పందం కుదుర్చుకుంటాను," అనుకున్నది తాబేలు.

"అలాగే మిత్రమా! అయితే, ముందే నువ్వు నాకొక మాట ఇవ్వాలి. మనం ఆవలి గట్టు చేరగానే, నువ్వు నన్ను స్వేచ్ఛగా విడిచి పెట్టాలి. సరేనా?" అంటూ తాబేలు జీతూను పరిశీలనగా చూసింది. పొంగుతూన్న నదిని దాటడానికి మరో మార్గం కనిపించక, జీతూ

### భాష

కురుఖ్ అనే భాష మాట్లాడతారు. క్రమక్రమంగా ఆర్య-ద్రావిడ భాషా కుటుంబాలకు చెందిన వివిధ మాండలికాలను స్వీకరించారు. ఇప్పుడు వాళ్ళు 'సాద్రి' అనే భాషను కూడా మాట్లాడుతున్నారు.





## రూపం

మామూలు ఎత్తూ, నల్లటి చర్మమూ, సన్నటి తలా కలిగి ఉన్నారు. వెడల్పాటి ముక్కూ, దృఢ మైన శరీరం కలిగి ఉన్నారు. స్త్రీల ముఖాలు అంటే ముక్కూ, కళ్ళూ, పెదాలూ తీర్చిదిద్ది నట్టు ఉంటాయి. వాళ్ళు నృత్యం చేస్తున్నప్పుడు వారి సోయగం స్పష్టంగా తెలియవస్తుంది.

తాబేలు నిబంధనకు ఒప్పుకున్నాడు.

"నీలాంటి నిస్సహాయ ప్రాణిని పట్టుకుని నేనేం చేయగలననుకున్నావు మరి! ఆవలిగట్టు చేరగానే నీదారి నీది, నాదారి నాది!" అన్నాడు జీతూ.

అతడి సమాధానంతో తృప్తి చెందిన తాబేలు మెల్లగా నదిలోకి దిగింది. జీతూ దాని వీపుమీద కూర్చున్నాడు. కొంతసేపటికి వాళ్ళు ఆవలి గట్టు సమీపించారు. అతడు గట్టుమీదికి ఎగిరి దూకాడు.

మరుక్షణమే తాబేలు నీళ్ళలోకి ఈదు కుంటూ వెళ్ళిపోయింది. దానికేసి ఆశగా చూస్తూ, "దీని మాంసాన్ని ఎప్పుడో ఒక రోజు రుచి చూస్తాను," అనుకున్నాడు జీతూ.

జీతూ మామగారి ఇల్లు చేరుకున్నాడు. ఇష్టమైన చేపల వేపుడుతో విందుభోజనం చేశాడు. హారియా, మోహువా కావలసినంత తాగాడు. బంధుమిత్రులతో కలిసి రాత్రంతా పాటలతో, నృత్యాలతో గడిపాడు. మాందర్, లోహతీ నగేరా వాయిద్యాల సంగీతంతో కలిసి ఆడాడు. నాగ్రిమిట్టీతో స్నానం చేసి, అందమైన ఆభరణాలు ధరించి కార్మీ మొదలైన స్త్రీలు మరింత అందంగా, ఆకర్షణీయంగా, ఆనం దంగా కనిపించారు.

ఆటపాటలు ముగిశాయి. మరునాడు తెల్లవారింది. బంధువులు ఎవరి ఇళ్ళకు వాళ్ళు బయలుదేరసాగారు. భార్యా పిల్లలు ఇంకా రెండురోజులుండి వస్తామని చెప్పడంతో జీతూ మాత్రం తమ ఊరికి బయలుదేరాడు. నదీ తీరంకేసి నడుస్తూ అతడు తనకిష్టమైన పాట అందుకున్నాడు:

వేసవిలో మండుతాయి అడవులూ
ఎగిరి వెళతాయి ఎటో అన్నిపక్షులూ!
ఆషాఢం తెస్తుంది వానలూ
చిగురిస్తాయి కొమ్మలూ రెమ్మలూ!
తిరిగి వస్తాయి అడవికీ పక్షులూ!

అతడు నదిని సమీపించాడు. ప్రవాహ ఉధృతం ఇంకా తగ్గలేదు. నదిని ఎలా దాటి వెళ్ళడమా అని ఆలోచిస్తూండగా, అదృష్టవ శాత్తు అతనికి నిన్న నదిని దాటించిన తాబేలు కనిపించింది.

"ఆహా! ఎంత విచిత్రం! భూమి చాలా చిన్నది. మనం మళ్ళీ మళ్ళీ కలుసుకుంటు న్నాం కదా, మిత్రమా!" అని తాబేలును పలకరించాడు జీతూ.

తాబేలు ఆ మాటలు విని ఉలిక్కిపడి తనను పిలుస్తున్నది ఎవరా అని మెల్లగా తిరిగిచూసి,



''అవును, నిజమే!'' అన్నది మెల్లగా.

''నన్ను ఈరోజుకూడా ఆవలి గట్టు చేరుస్తావా?'' అని అడిగాడు జీతూ. తాబేలు మరేమీ మాట్లాడకుండా అందుకు వెంటనేఅంగీకరించడం జీతూకు ఆశ్చర్యం కలిగించింది. జీతూ తాబేలు వీపు మీద కూర్చున్నాడు. తాబేలు ఆవలిగట్టుకేసి బయలు దేరింది. కొంతసేపు ఇద్దరూ ఏమీ మాట్లాడ లేదు. నదీ మధ్యానికి వెళ్ళినప్పుడు తాబేలు, ''నువ్వు ఇప్పుడేమి ఆలోచిస్తున్నావు?'' అని జీతూను అడిగింది.

నది దాటుతున్నప్పుడు అబద్ధం చెప్పకూడదనీ, అలా చెబితే నీళ్ళలో మునిగిపోతామనీ ఓరాన్లలలో ఒక నమ్మకం ఉంది. కాబట్టి జీతూ నిజమే చెప్పవలసి వచ్చింది. ''ఈరోజు నిన్ను వదిలిపెడతానని మాట ఇవ్వలేదు గనక, నిన్ను ఇంటికి తీసుకుపోయి, కోసుకు తిందామనుకుంటున్నాను,'' అన్నాడు జీతూ.

''నువ్వు అలా మాట్లాడ్డం మరీ నీచం, దుర్మార్గం! అయినా నేను నీ ఉద్దేశాన్ని ఊహించాను. అదిసరే, నేనేమనుకుంటున్నానో నీకు తెలుసుకోవాలని లేదా?'' అని అడిగింది తాబేలు.

''ఏంఆలోచిస్తున్నావు?'' అనిఅడిగాడుజీతూ.

''నేను నిన్నీ నదిలో ముంచబోతున్నాను. నిన్ను క్షేమంగా ఆవలిగట్టు చేరుస్తానని నీకు మాట ఇవ్వలేదుగా మరి?'' అని ఎదురు ప్రశ్న వేసింది తాబేలు.

''వద్దువద్దు.దయచేసి అలాచేయొద్దు,'' అని బతిమలాడాడు జీతూ భయంతో వణికిపోతూ.

''నాకు హాని చేయాలని ఆలోచిస్తున్న నీ అంతుచూస్తే తప్పేమిటి?'' అన్నది తాబేలు కోపంగా.

అప్పుడే ఒక నక్క నదీ తీరంలో పడుకుని

## వృత్తులు

ప్రధానంగా వ్యవసాయం చేస్తారు. రకరకాల వనమూలికల, జంతువుల ఔషధ గుణాలు కూడా వాళ్ళకు బాగా తెలుసు. వేట మరొక ముఖ్యమైన వృత్తి. కొందరైతే వ్యవసాయమూ, వేటా రెండూ చేసుకుంటూ జీవయాత్ర సాగిస్తారు.



ఉండడం జీతూ చూశాడు. "సరే, నువ్వు నన్ను వదిలిపెట్టాలా? వద్దా? అని ఆ నక్కను అడుగుదాం," అన్నాడు జీతూ, తాబేలు తనెక్కడ తప్పించుకోకుండా నదిలో ముంచే స్తుందేమోనన్న భయంతో.

## నమ్మకాలు

ఇతరకొండజాతి ప్రజలకులాగేఓర్నాస్లకు కూడా దయ్యాలు, శకునాలు, చేతబడులు, వింతవింత నమ్మకాలు, నిషిద్ధాలు, రకరకాల ఆచారాలు మూఢనమ్మకాలు కలిగిఉన్నారు.

★ ఇంటికి పెళ్ళికూతురు వచ్చినట్టు కల వస్తే వేటలో జింకను చంపగలరని ఒక నమ్మకం. జంతువులను చంపుతున్నట్టు కలవస్తే తమను తామే చంపుకోగలమనే భయం!



★ వేటకు వెళుతున్నప్పుడు ఆడది ఒట్టికుండతో ఎదురైతే మహాచెడ్డశకునం. నీళ్ళ కుండతో ఎదురైతే శుభశకునం.

★ నక్కకు తగిలినా, ఆడది తొక్కినా బాణం నిష్ప్రయోజనం అనేభావం వాళ్ళల్లో ఉంది.



"అలాగే! నువ్వు నన్ను తినవచ్చా? వద్దా? అని కూడా ఆ నక్కను అడుగు," అన్నది తాబేలు.

నక్క తలతిప్పి, నదిమధ్యలో తర్జనభర్జ నలు పడుతున్న వాళ్ళకేసి చూసింది.

"నక్కబావా! నక్కబావా!"అని జీతూ, తాబేలూ ఒక్కసారిగా కేక వేశారు. అయితే ఆ తరవాత వాళ్ళు చెప్పిన మాటలేవీ నక్క చెవిలో పడలేదు. అది వాళ్ళ మాటలు విన డానికి చెవులు రిక్కించి చూసింది. జీతూ ఊపిరి బిగబట్టి గట్టిగా అరిచాడు. అయినా ప్రయోజనం లేకపోయింది.

"నాకేదీ వినిపించడంలేదు. ఇంకాస్త గట్టిగా మాట్లాడండి," అన్నది నక్క.

ఇప్పుడు జీతూ తమ వివాదం గురించి నక్కకు వివరించాడు.

"ఊహు, నా చెవులకేమయిందో తెలియ డంలేదు. మరి కొంచెం ముందుకు వచ్చి మాట్లాడగలరా?" అన్నది నక్క.

తాబేలు వేగంగా ఈదుకుంటూ గట్టు సమీపానికి వచ్చింది. ఇప్పటికీ నక్క వాళ్ళ మాటలను వినలేకపోయింది. ఇంకాస్త దగ్గరికి రమ్మన్నది. ఇప్పుడు తాబేలు గట్టు దగ్గరికే వచ్చేసింది. తమ వివాదం గురించి చెప్పడానికి జీతూ నోరు తెరవబోయాడు.

"మూర్ఖుడా! నేలమీదికి దూకు!" అని నక్క అతణ్ణి హెచ్చరించింది. జీతూ ఒక్క గెంతున గట్టుమీదికి దూకి, 'బతికిపోయానురా, దేవుడా!' అని సంతోషించాడు.

"ఇంకా ఎందుకు నువ్వక్కడే ఉన్నావు? వాడు నిన్ను పట్టుకునేలోగా, పారిపో!" అని నక్క తాబేలును హెచ్చరించింది. తాబేలు వేగంగా లోతైన నీళ్ళకేసి ఈదుకుంటూ వెళ్ళిపోయింది.

వివేకి అయిన నక్క మళ్ళీ నిద్రలోకి జారుకున్నది!



## పారిభాషిక పదాలు

బస్తీ: ఇళ్ళ సమూహం

ఛ్ఛతి: బిడ్డపుట్టిన ఆరవరోజు. ఈ రోజు బిడ్డపక్కన 'బిలువా' ఆకులను పెడతారు. ఈ 'బిలువా' ఆకులు తగలగానే శరీరం వాచి నొప్పిపెడుతుంది. శిశువుగా ఉన్నప్పుడే బిడ్డకు దీనిని తాకిస్తే మిగిలిన జీవితకాలమంతా బిడ్డకు ఈ ఆకుల బెడద ఉండదని ఒక నమ్మకం. ఇవి ఒక రకంగా వ్యాధి నిరోధక టీకాలులాంటివి.

సర్నబుర్హియా: ప్రధాన దేవత

హరియా: బియ్యంతో మట్టిపాత్రలలో తయారుచేసే బీర్‌లాంటి మధుపానం. ముఖ్యమైన శుభకార్యాలకు వచ్చే అతిథులకు ఇస్తారు.

మొహువా: మొహువా పువ్వుల ఎండు పత్రాలనుంచి తయారుచేసే ఘాటైన మధుపానం.

మాందర్: గాంభర్‌చెట్టు బోదెకొయ్యతో తయారుచేసే మద్దెలలాంటి వాయిద్యం. దీనిని మట్టితో కూడా చేస్తారు.

లోహతి నగేరా: మరొకవిధమైన మద్దెల

నాగ్రి మిట్టి: ఓరాన్లు సబ్బులాగా ఉపయోగించే నల్ల బంకమట్టి. ఇది చాలా మెత్తగా ఉంటుంది. ఒంటినీ, జుట్టునూ దీంతో శుభ్రం చేసుకుంటారు.

# వ్యాపారి అతి తెలివి!

రెండేళ్ళుగా వాన చినుకు లేదు. గ్రామ ప్రజలు ఆశగా ఆకాశంకేసి చూసి చూసి కళ్ళు కాయలు కాచాయి. పెట్టిన పైర్లు ఎండిపోయాయి. కొత్తగా పెట్టడానికి అవకాశంలేదు. ఎండలు మండిపోతు న్నాయి. ఏం చేయడానికీ తోచక గ్రామప్రజలు విచారంలో మునిగిపోయారు.

అందరికన్నా ఎక్కువగా దెబ్బతిన్నవాడు ఆ గ్రామంలోని అజీజ్. ఉన్న కుంటడు పొలమూ ఎండ తాకిడికి బీటలు పారడంతో, పొట్ట చేత బట్టుకుని ఊరు వదిలి వెళ్ళడం తప్ప వాడికి మరొక మార్గం కనిపించలేదు. వెళ్ళేముందు గ్రామంలో చిల్లరకొట్టు నడుపుతూన్న మీర్‌చంద్ దగ్గర పన్నెండు ఉడికించిన గుడ్లు అప్పుగా పుచ్చుకున్నాడు. మరునాడు తెల్లవారక ముందే ఊరు వదిలిపెట్టాడు.

మీర్‌చంద్ అజీజ్‌కిచ్చిన అప్పు తిరిగి రాదనే నిర్ణయించుకున్నాడు. ''చేతిలో చిల్లిగవ్వకూడా లేని పేదవాడు పాపం! వాడెలా నా అప్పు తీర్చ గలడు? నేనిచ్చిన పన్నెండు గుడ్లు వాణ్ణి మరో పదిరోజులు చావకుండా ప్రాణాలతో కాపాడ



గలవు. అంతే!'' అనుకున్నాడు వ్యాపారి.

అయితే, అతడనుకున్నట్టు అజీజ్ ఆకలితో చనిపోలేదు. బ్రహ్మాండంగా బతికాడు. ఎలా? కాలం కలిసిరావడంతో మరో ఏడేళ్ళ తరవాత దర్జాగా స్వగ్రామానికి తిరిగి వచ్చాడు. వ్యాపారితో సహా గ్రామప్రజలందరూ ఆశ్చర్యంతో కళ్ళప్ప గించి చూస్తూండగా, తెల్లటి గుర్రంపైనుంచి కిందికి దూకాడు. అతని వెంట మరికొన్ని గుర్రపు బళ్ళు!

అజీజ్ తెచ్చుకున్న ధనంతో గ్రామంలోనే పెద్దభవంతీ, పొలాలూ, పళ్ళతోటలూ కొన్నాడు. అజీజ్ ఇంతలో అంతగా ఎలా ఎదగగలిగాడా అని గ్రామప్రజలు ముక్కుపై వేలేసుకున్నారు. ఎక్కడ చూసినా అతణ్ణి గురించే చర్చలు!

మీర్‌చంద్ తను ఇచ్చిన కోడిగుడ్ల అప్పు సంగతి మరిచిపోలేదు. ఒకనాడు వెళ్ళి అజీజ్ ఉన్న భవంతి తలుపు తట్టాడు. చక్కటి దుస్తు లతో ఉన్న సేవకుడు వచ్చి తలుపు తెరిచాడు.

''మీ యజమానిని చూడాలి!'' అన్నాడు మీర్‌చంద్.

సేవకుడు అతన్ని లోపలికి తీసుకు వెళ్ళాడు. అజీజ్ అతన్ని ఆదరంతో పలకరించాడు. అతిథి మర్యాదలు చేశాడు. అయినా మీర్‌చంద్ వాటినన్ని టినీ పట్టించుకోకుండా, ''అజీజ్! ఏడేళ్ళక్రితం నువ్వు గ్రామం వదిలి వెళ్ళేప్పుడు నీకు పన్నెండు గుడ్లు అప్పుగా ఇచ్చాను జ్ఞాపకం ఉందా? ఇప్పుడు నువ్వు నాకు వాటికిగాను వెయ్యి బంగారు నాణాలు చెల్లించాలి!''అన్నాడు.

''పన్నెండు కోడి గుడ్లకు వెయ్యి బంగారు నాణాలా? పెద్దలు మీరు, పరిహాసం ఆడడం లేదు కదా!'' అన్నాడు అజీజ్ ఆశ్చర్యంగా. ఆ తరవాత అతడే, ''దానికి తగిన మొత్తం నేనే చెల్లించాలనుకుంటున్నాను. అయినా, మీరు

అడుగుతున్నది మరీ ఎక్కువ!''అన్నాడు.

"నాకు వెయ్యి బంగారు నాణాలే కావాలి. అంతకన్నా తక్కువ పుచ్చుకోను!'' అన్నాడు మీర్‌చంద్ నిష్కర్షగా.

అయితే, అజీజ్ అందుకు ఒప్పుకోలేదు. మీర్‌చంద్ , ''నువ్వు, ఇలా దారికి రావు. నిన్ను న్యాయస్థానానికి లాగుతాను,''అని హెచ్చరించి అక్కడి నుంచి కోపంగా వెళ్ళిపోయాడు.

మీర్‌చంద్ చెప్పినంత పనీ చేశాడు. అతడు అజీజ్‌మీద న్యాయస్థానంలో ఫిర్యాదు చేశాడు. తగాదా విచారణకు వచ్చింది. అయినా సమయానికి అజీజ్ అక్కడికి రాలేదు. మీర్‌చంద్‌కు పట్టరాని కోపం వచ్చింది. కొంతసేపు కుదురుగా ఉండలేకపోయాడు. ఆఖరికి అజీజ్ రెండు గంటలు ఆలస్యంగా వచ్చాడు.

అతన్ని చూడగానే మీర్‌చంద్ ఆవేశం కట్టలు తెంచుకున్నది. ''అయ్యా! అదిగో అతడు వచ్చాడు. నాకు న్యాయంగా చెందవలసిన మొత్తాన్ని ఇవ్వడానికి నిరాకరించిన పెద్దమనిషిని చూడండి. అతడికి అప్పుగా ఇచ్చిన ఆ పన్నెండు గుడ్లేగనక నాదగ్గరే ఉన్నట్టయితే, వాటిని పొదుగులో పెట్టి, పిల్లలు చేసి ఉండేవాణ్ణి. అవి పెద్దవై గుడ్లు పెట్టి ఉండేవి. నేను గుడ్ల వ్యాపారంతో ఎంతో సంపాయించి ఉండేవాణ్ణి. అయినా, కష్టపడుతున్నాడు కదా! మనల్ని వచ్చి అడిగాడే అన్న కనికరంతో అన్నీ అతనికే ఇచ్చి సాయం చేశాను. అయితే ఇప్పుడేమో అతడు వాటికి తగిన మూల్యం చెల్లించనంటున్నాడు, పైగా అతడి గుండెధైర్యం మీరే చూశారు కదా! న్యాయస్థానానికే ఆలస్యంగా వస్తున్నాడు!'' అన్నాడు.

న్యాయాధికారి, అజీజ్‌కేసి చూస్తూ, ''నువ్వు మోసం చేశావని అతడు ఆరోపిస్తున్నాడు. ఆలస్యంగా వచ్చి న్యాయస్థానం సక్రమంగా పని చేయడానికి అవరోధం కల్పించావు! వీటికి నీ సంజాయిషీ ఏమిటి?'' అని అడిగాడు.



''ప్రభూ! ఆలస్యంగా వచ్చినందుకు క్షమించాలని ప్రార్థిస్తున్నాను,'' అంటూ అజీజ్ వినయంగా చేతులెత్తి నమస్కరించి, ''మా పెరటి తోటలో గుగ్గిళ్ళు విత్తడంలో కొంత ఆలస్యమయింది!'' అన్నాడు.

''గుగ్గిళ్ళను విత్తడమా? ఏమిటి నువ్వంటున్నది?'' అన్నాడు న్యాయాధికారి విస్మయంతో.

''ప్రభూ! మా వంటవాడు ఇవాళ శనగలతో గుగ్గిళ్ళు చేశాడు. వాటిని చూడగానే నాకొక ఆలోచన వచ్చింది. వాటిని అలాగే పెరటి తోటలో విత్తినట్టయితే హాయిగా గుగ్గిళ్ళు పండుతాయి కదా అని!'' అన్నాడు అజీజ్.

''ఏమిటలా మూర్ఖంగా మాట్లాడుతున్నావు. మతి చెడిందా ఏమిటి అజీజ్! గుగ్గిళ్ళుగా ఉడికించిన శనగలు మొలకెత్తవని నీకు తెలియదా? అవి పెరిగి నీకు గుగ్గిళ్ళను పండించడమేమిటి?'' అని అడిగాడు న్యాయాధికారి.

''ఎందుకు మొలకెత్తవు ప్రభూ! బాగా ఉడకబెట్టిన గుడ్ల నుంచి కోడిపిల్లలు పుట్టినప్పుడు; ఉడికించిన గుగ్గిళ్ళుకూడా మొలకెత్తి పంటనివ్వగలవు!'' అన్నాడు అజీజ్.

మీర్‌చంద్ నోట మాట రాలేదు. న్యాయాధికారి చిన్నగా నవ్వాడు. అజీజ్ న్యాయం పొందాడు.

# చందమామ కబుర్లు

## వయసు: 12,500,000,000 సం.

ఇదీ మనం నివసించే విశ్వం వయసు. ప్రపంచ వ్యాప్తంగా ఉండే విజ్ఞానశాస్త్రవేత్తలు దీనిని అంగీక రించారు. ఈ నిర్ధారణకు వాళ్ళెలా రాగలిగారా అని మీరు ఆశ్చర్యపడుతున్నారుకదూ! మనవిశ్వం వయ సును నిర్ధారించడానికి పరిశోధనలు జరుపుతూన్న శాస్త్రవేత్తలు ఒక ప్రాచీనమైన నక్షత్రంలో 'యాక్టివ్ యురేనియం' ఉండడం గమనించారు. దీనిని కనుగొనడానికి వాళ్ళు 'రేడియో యాక్టివ్ కాస్మోక్రోనో మెట్రీ' అనే నూతన సాంకేతికవిధానాన్ని ఉపయో గించారు. ఇంతకుపూర్వం ఉపయోగించిన విధానా లతో పోల్చినప్పుడు ఇది లోపరహితమని కను గొన్నారు. ఈ అధ్యయనానికి వాళ్ళు ఎంపిక చేసిన నక్షత్రానికి సి.ఎస్.31082-001 అని పేరు పెట్టారు. దీనిని దక్షిణ అమెరికా చిలీలోని పెరానెల్ పరిశోధనశాల నుంచి జెయింట్ టెలిస్కోప్ సాయంతో పరిశీలించారు. ఈ నక్షత్రంలో కనిపించిన 'యాక్టివ్ యురేనియం' విశ్వం వయసును నిర్ధారించడానికి ఉపయోగపడింది.







## అంగారక గ్రహంలో జీవరాశులు

అంగారకగ్రహంలో జీవరాశులున్నాయనడానికి స్పష్టమైన సాక్ష్యాధారాలున్నాయని హంగరీ శాస్త్రవేత్తలు అభిప్రాయపడుతున్నారు. ఆ గ్రహాన్ని విభిన్నకోణాల నుంచి తీసిన 60,000 ఛాయా చిత్రాలను జాగ్రత్తగా అధ్యయనం చేసిన తరవాత వాళ్ళీ నిర్ణయానికి వచ్చారు. మంచు కప్పబడిన అంగారక గ్రహం దక్షిణ పార్శ్వంలో భూమిమీద ప్రాణులను పోలిన జీవరాశుల వేలాది అడుగు జాడలను వాళ్ళు కనుగొన్నారు.

## అమెరికా 'ఆవిర్భావం'

1 4 9 2 లోనే క్రిస్టఫర్ కొలంబస్ అమెరికా తీరంలో అంటే శాన్‌సాల్వడార్‌లో అడుగు పెట్టాడన్నది అందరికీ తెలిసినదే. అయితే 'అమెరికా' అనే పేరు మొట్టమొదటిసారిగా ఎప్పుడు ఉపయోగించబడిందో తెలుసా? 1 5 0 7లో రూపొందించబడిన ప్రపంచ పటంలో ఇది ఉన్నది. వెస్‌పుస్సీ అనే నావికుడు 1 5 0 1 - 0 2 లో ఈ నూతన ప్రపంచంలో అడుగుపెట్టి అదొక ప్రత్యేక ఖండం అని భావించాడు. కార్టోగ్రాఫర్ మార్టిన్ ముల్లర్ ఈ ఖండానికి అమెరికా అని పేరు సూచించి గుర్తించాడు. ఇన్నాళ్ళు అందుబాటులో లేని ఆ ప్రపంచ పటాన్ని ఈమధ్యే అమెరికాలోని లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్ తన ఆర్కైవ్స్ కోసం 1 0 , 0 0 0 , 0 0 0 డాలర్లకు కొన్నది.










## లాటరీ అదృష్టం!

జర్మనీ, ఫ్రాంక్‌ఫర్ట్ నగరానికి చెందిన యాభై యేళ్ళ నిరుద్యోగ మహిళ తనకు ఆ పూట లభించిన డబ్బుతో రొట్టెముక్క కొనుక్కుని ఆకలి తీర్చుకోవడానికి బదులు, ఒక లాటరీ టిక్కెట్టు కొని 1 0 , 0 0 0 , 0 0 0 అమెరికన్ డాలర్ల జాక్‌పాట్ సాధించింది. ఆమె మామూలుగా ఎప్పుడూ లాటరీల జోలికి వెళ్ళేది కాదు. అయితే ఆ రోజున తన దుర్భర ఆర్థికదుస్థితిని తలుచుకుని, దాని నుంచి ఎలా బయటపడడమా అని, పస్తుండి తన అదృష్టాన్ని పరీక్షించుకుంది. గట్టెక్కింది. అయితే ఇలాంటిది ఎప్పుడో ఎక్కడో జరిగే అరుదైన విషయం. ఆమె లాగే మనమూ లాటరీతో గట్టెక్కేద్దాం అని ఆశిస్తే మాత్రం కష్టాలు, కడగండ్లు పెరగక తప్పవు మరి!

# మనదేశం గురించి తెలుసుకుందాం

క్విజ్

1. వందకోట్ల జనాభాకు మనదేశం ఎప్పుడు చేరిందో తెలుసా?
2. ప్రపంచంలోనే ఎత్తయిన పర్వతశిఖరం ఎవరెస్ట్ నేపాల్-టిబెట్ సరిహద్దులో ఉంది. మనదేశంలో ఎత్తయిన పర్వత శిఖరం ఏది? ఎత్తు ఎంత?
3. పంజాబ్‌కు ఆ పేరు రావడానికి అక్కడ ప్రవహించే ఐదు నదులు అన్నది మీకు తెలుసు. మరి ఆ నదుల పేర్లేమిటో తెలుసా?
4. గత సంవత్సరం ఏర్పాటయిన మూడు కొత్త రాష్ట్రాలు ఏవి? వాటిపేర్లు, రాజధానుల పేర్లు ఏమిటి?
5. స్వాతంత్ర్యానంతరం ఒకరాష్ట్రాన్ని ఇద్దరు మహిళా ముఖ్యమంత్రులు పాలించారు. ఏ రాష్ట్రాన్ని? ముఖ్యమంత్రులు ఎవరు?

(సమాధానాలు వచ్చే నెలలో)

## అక్టోబర్ క్విజ్ సమాధానాలు:

1. కేరళలో జరుపుకునే ఓణం పండుగ. మహావిష్ణువు ఐదవ అవతారమైన వామనుడు పాతాళానికి అణగదొక్కిన బలి చక్రవర్తి యేటా భూలోకానికి వచ్చే సందర్భాన్ని సూచించేది.
2. దీపావళి. నవంబర్ 14.
3. నవరాత్రికి తరవాత విజయదశమి. విద్యాదేవత సరస్వతికి సంబంధించనది. బెంగాలీలు 'వసంతపంచమి' రోజున సరస్వతి పూజ చేస్తారు.
4. రాఖీ లేదా రక్షాబంధన్ మరియు భాయ్-ధూజ్.
5. జరతుష్ట్రుడి జన్మదినం ఖోర్డాద్-సాల్.
6. ఈద్. దీనిని మిలాడి-అన్-నబి అని కూడా అంటారు.
7. శిలువ చేయబడిన ఏసుక్రీస్తు పునరుజ్జీవుడైన రోజుకు గుర్తుగా ఈస్టర్ జరుపుకుంటారు.
8. బుద్ధుడు వైశాఖ పూర్ణిమనాడు జన్మించాడు. వైశాఖపూర్ణిమనాడే జ్ఞానం పొందాడు. వైశాఖపూర్ణిమనాడే నిర్యాణం కూడా చెందాడు.
9. పొంగల్ (సంక్రాంతి).
10. శబరిమలలోని అయ్యప్పదేవాలయం. కొన్నిక్షణాలు భక్తులు దూరపుకొండలమధ్య దివ్యజ్యోతిని దర్శిస్తారు.

## నవంబర్ క్విజ్ సమాధానాలు:

1. ధ్రువుడు - ఉత్తానపాదుడు
2. మార్కండేయుడు - మృకండుడు
3. ప్రహ్లాదుడు - మహావిష్ణువు
4. నచికేతుడు - వాజశ్రవుడు
5. ఏకలవ్యుడు -కురుపాండవులు
6. భరతుడు - దుష్యంతుడు

# భారత సంస్కృతి–చరిత్ర

ఒక గొప్ప నాగరికతలోని ఘట్టాలు
తరతరాలుగా సత్యం కోసం జరిగిన అన్వేషణ!

## 23. సీతా మహాసాధ్వి!



సందీపుడు ఇల్లు ప్రతిధ్వనించేలా విరగబడి నవ్వడం; శ్యామల వాణ్ణి వారించడం తాతయ్య దేవనాథుడికి ఆశ్చర్యం కలిగించింది. సందీపుడు ఇలా పకపకా నవ్వడం ఆయన అంతకుముందెన్నడూ చూడలేదు. చదువుతూన్న వార్తాపత్రికతో వరండాలోకి వచ్చాడు. సరిగ్గా ఆ సమయానికే ఆయన కోడలు జయశ్రీ కూడా డ్రాయింగ్ రూము లోంచి వెలుపలికి వచ్చి, "ఏమిటీ అల్లరి? ఇంట్లోవాళ్ళను కాస్త ప్రశాంతంగా ఉండనివ్వరా?" అని పిల్లల్ని మెల్లగా మందలిస్తోంది. పిల్లలు చేసే అల్లరికి, మధ్యాహ్నంభోజనం ముగించి కునుకుతీస్తున్న మామగారికి నిద్రాభంగం కలిగిస్తుందేమోనని ఆమె భయం. అయితే అంతలోనే నిద్రలేచి పత్రిక చదువుతూ, మధ్యలో లేచి వచ్చిన మామగారిని చూడగానే ఆ ఆదుర్దా కాస్త తగ్గిపోయింది.

"టీ మీగదిలో పెట్టమన్నారా మామయ్యా?" అని అడిగింది జయశ్రీ.

"అలాగేనమ్మా! అయినా, సందీపుడు ఇలా నవ్వడానికి కారణం ఏమిటో తెలుసుకోవాలికదా," అంటూ దేవనాథుడు మనవడి కేసి నవ్వుతూ చూశాడు.

"భారత ఒలింపిక్ జట్టుకు నాయకత్వం వహించి నేను బీజింగ్ వెళతానంటే మీరు నవ్వకుండా ఉండగలరా, ఆ సంగతి చెప్పండి," అన్నాడు సందీపుడు.



నేను చెప్పలేను. అయితే, పసితనంలో లక్ష్మీబాయి కూడా ఎంతో సున్నితమైన మన సుతో, సిగ్గుపడుతూ ఉండేదన్న విషయం మాత్రం నువ్వు గ్రహించాలి. అవసరం ఏర్పడి నప్పుడు ఆమె సుశిక్షితులైన రాటుదేలిన బ్రిటిష్ సేనానాయకులనే ఎదిరించి పోరా డింది. దేశభక్తికీ, ధైర్యసాహసాలకూ మారు పేరుగా మనదేశచరిత్రలో మణిదీపంగా నిలిచిపోయింది! అయినా అది వేరే విషయం. అయితే, నాకిప్పుడు విచారం కలిగించే విషయం మరొకటి ఉంది. అదే సీతపట్ల నీకున్న అభిప్రాయం. ఆమెను దృఢచిత్తం లేని భీరువు అనడం సమంజసం కాదు," అన్నాడు దేవనాథుడు.

జయశ్రీ అంతలో టీ తీసుకుని వరండా గుండా దేవనాథుడి గదిలోకి వెళ్ళింది. ఆమె వెంట దేవనాథుడూ, ఆయనవెంట శ్యామలా, సందీపుడూ గదిలోకివెళ్ళి టీ అందుకున్నారు.

"మరి, పరిస్థితులకు బలియైపోయిన నిస్సహాయురాలైన అబలగానేసీతాదేవి కనిపి స్తుందికదా మామయ్యా?" అని అడిగింది అనుమానంగా జయశ్రీ.

"అవును, అది నిజమేకదా?" అని వంత పాడాడు సందీపుడు.

"కాదు. ఆ అభిప్రాయం సరైనదికాదు. ఇప్పుడు నేను కొన్ని ప్రశ్నలడుగుతాను. వాటికి సమాధానాలు ఆలోచించండి. ఆ తరవాత మీ అభిప్రాయాలు మార్చుకోవడం; మార్చుకోక పోవడం మీ ఇష్టం. కైకేయి పధ్నాలుగేళ్ళు వన వాసానికివెళ్ళమన్నది ఒక్కరాముణ్ణేతప్ప సీతను కాదు. అవునా?" అని అడిగాడు దేవనాథుడు.

"అవును," అంటూ జయశ్రీ అక్కడే

"ఆ సంగతి తెలియదుగానీ, అలాంట ప్పుడు నేను జాతీయ మల్లయుద్ధం చాంపి యన్‌గా నీ జట్టుతో రావడం మాత్రం ఖాయం!" అన్నాడు దేవనాథుడు నవ్వుతూ.

"అంతకన్నా నువ్వు శ్యామల జట్టుతో కలిసి నానాసాహెబ్ వేషం వేయవచ్చు. ఆమె ఝాన్సీరాణిలక్ష్మీబాయి వేషం వేస్తోందిగామరి. వాళ్ళ పాఠశాల స్వర్ణోత్సవాల సందర్భంగా వేస్తూన్న నాటకంలో జయశ్రీ ఝాన్సీలక్ష్మీ బాయి వేషం వేస్తోంది. చూశారా ఈ విడ్డూరం? పిరికి ముఖానికి లక్ష్మీబాయి వేషం? కావా లంటే సీత వేషం వేయవచ్చు కదా? ఝాన్సీ వేషం ఏమిటితాతయ్యా?" అంటూసందీపుడు మళ్ళీ ఎగతాళిగా నవ్వాడు.

"వీరనారి లక్ష్మీబాయి వేషం వేయడానికి మన శ్యామల పనికి వస్తుందా లేదా అన్నది

కూర్చున్నది. పిల్లలూ కూర్చున్నారు.

"సీతను కూడా వనవాసానికి వెళ్ళమని ఎవరూ చెప్పలేదు. రాముడున్నచోటే సీతకు అయోధ్య అంటూ ఆమె రాముడివెంట అరణ్యానికి వెళ్ళాలని నిర్ణయించుకున్నది. పెద్దలు వద్దన్నా వినిపించుకోలేదు. ఆమె నిర్ణయానికే కట్టుబడి దృఢచిత్తంతో నిలబడింది కదా?" అని సమాధానం కోసం కొంతసేపు ఆగాడు దేవనాథుడు.అయినా ఎవరూ బదులు పలకలేదు. జయశ్రీ మాత్రమే మూలగ్రంథాన్ని చదివింది. పిల్లలు సంక్షిప్త రామాయణ కథ చదివారుతప్ప, అసలు పుస్తకం చదివే వయసుకాదు వాళ్ళది.

దేవనాథుడు మళ్ళీ, "మీరు ఇప్పుడున్న అభిప్రాయాలకు ప్రభావితులు కాకుండా, రామాయణంలో ఆ తరవాత జరిగిన సంఘటనలను ఒకసారి మననం చేసుకోండి. అరణ్యవాసంలో బంగారు లేడిని తెమ్మని రాముణ్ణి కోరింది సీత. వద్దన్నా వినకుండా పట్టుపట్టింది.మాయలేడి వెంట రాముడు వెళ్ళడానికి కారణం సీత. రాముడి కంఠస్వరంతో మారీచుడు ఆర్తనాదం చేసినప్పుడు లక్ష్మణుణ్ణి రాముడి దగ్గరికి వెళ్ళమని ఆజ్ఞాపించింది సీత! రక్షణ లేకుండా ఒంటరిగా ఉండడానికి ఆమె సిద్ధపడింది. మారువేషంలో వచ్చిన రావణుడికి భిక్ష వేయడానికి వెళ్ళి, లక్ష్మణుడు చేసిన హెచ్చరికను కూడా లెక్కచేయకుండా లక్ష్మణ రేఖను దాటింది. ఇవన్నీ పిరికివాళ్ళ లక్షణాలా? స్వయం నిర్ణయం తీసుకునే శక్తిలేక చేసిన పనులా? నిజానికి ఆమె సొంతంగా తీసుకున్న నిర్ణయాలే ముఖ్యమైన ఘట్టాలలో కీలకపాత్ర వహించాయి. ఆలోచించి చూడండి," అన్నాడు దేవనాథుడు.



"నిజమే! ఆ కోణం నుంచి నేనెప్పుడూ ఆలోచించలేదు," అన్నది జయశ్రీ.

"రక్షించావు తల్లీ! నీ సంగతే అలా ఉంటే, అమాయక ప్రాణులైన మమ్మల్ని తాతయ్య విమర్శించలేరుకదా?" అంటూ చిన్నగా నవ్వాడు సందీపుడు మెరుస్తూన్న కళ్ళతో.

దేవనాథుడు అరమోడ్పు కన్నులతో కొంతసేపు ఏదో ఆలోచిస్తూ, మళ్ళీ ఇలా అన్నాడు:

"అశోకవనంలో సీతను చూసిన హనుమంతుడు, ఆమెను తన భుజాలపై రాముడి దగ్గరికి చేరుస్తానన్నాడు. సీత అందుకు ఒప్పుకోలేదు. రావణుడు తనను దొంగతనంగా అపహరించాడు. రాముడి దూత కూడా, రావణుడికి తెలియకుండా అదేపని చేస్తే, ఆ తరవాత ఇద్దరికీ ఉన్న తేడా ఏమిటి? అని హనుమంతుణ్ణి నిలదీసింది. రాముడే స్వయంగా వచ్చి

రావణసంహారంచేసి తనను చెరవిడిపించాలని నిర్ద్వంద్వంగా చెప్పింది కదా! ఇవి భయంతో చెప్పిన మాటలా? ఆమె దయామయి; హను మంతుడి క్షేమాన్ని కాంక్షించింది. ఆఖరుగా రావణ సంహారానంతరం అగ్నిపరీక్షకు సిద్ధమ యింది. సీత ధర్మం అనుకుని చూపిన మార్గం లోనే, ఆమె అభీష్టానుసారమే మిగిలినవారం దరూ నడుచుకోవలసి వచ్చింది!''

దేవనాథుడు కొంతసేపు మౌనంగా కూర్చు న్నాడు. మిగిలినముగ్గురుకూడా ఏమీ మాట్లాడ లేదు. శ్యామల తాతయ్య ముందున్న ఖాళీ టీ కప్పును తీసుకుంటూ, ''తాతయ్యా! రామా యణం చివరసీతాదేవి మరో అగ్ని ప్రవేశానికి ఎందుకు నిరాకరించింది? భూగర్భంలోకి ఎందుకు వెళ్ళిపోయింది?'' అని అడిగింది.

''మంచి ప్రశ్న అడిగావు తల్లీ! మొదటిసారి అగ్నిప్రవేశానికి స్వయంగా సీతే సిద్ధపడింది. రెండవసారి ఆమెను అగ్ని ప్రవేశం చేయమని ఇతరులు సలహా ఇచ్చారు. ఆ రెంటికీ మధ్య చాలాభేదం ఉంది. అల్పుల కోసం తన పవిత్ర తను నిరూపించుకోవలసిన నిర్బంధం ఆమెకు లేదు. సీత భూజాత. భూమి నుంచే ఆమె జన్మించిందని మీకు తెలుసు. మళ్ళీ భూమాత ఒడినే చేరాలని నిర్ణయించింది. చీకటిశక్తుల పీచమణచి, దుష్ట రాక్షస మూకల నాయకుడైన రావణ సంహారానికి రాముణ్ణి ప్రేరేపించడానికి ఆమె అవత రించింది. ఆ పనిని సక్రమంగా నెరవేర్చింది. ముందుతరాలకు ఆదర్శంగా రామరాజ్యాన్ని స్థాపించవలసిన బాధ్యత ఇంకా రాముడిపై ఉన్నది. అందువల్ల ఆమె ముందుగానే వచ్చిన చోటికి వెళ్ళిపోయింది. ఇక్కడ మరో ముఖ్య విషయం మీకు చెప్పాలి. రామాయణంలో చివరి భాగమైన ఉత్తరకాండ వాల్మీకి విరచితం కాదు. రావణ సంహారానంతరం శ్రీరాముడి అయోధ్య పునరాగమనం, శ్రీరామపట్టాభి షేకంతో వాల్మీకి రామాయణం పరిసమాప్త మవుతుంది. ఉత్తరకాండను మరొక గొప్పకవి ఎవరో రచించాడు,'' అన్నాడు దేవనాథుడు ముగింపుగా. (ఇంకాఉంది)





# దేవీభాగవత కథలు

పూర్వం త్వష్ట ప్రజాపతి దేవతలందరిలోకీ గొప్పవాడూ, గొప్ప తపస్సుచేసినవాడూనూ. ఆయన ఇంద్రుడిపై ద్వేషంతో మూడు తలలు గల విశ్వరూపుణ్ణి సృష్టి చేశాడు. విశ్వరూపుడు పెరిగి పెద్ద అవుతూ, మూడు తలలతోనూ మూడు వేరువేరు పనులు చేస్తూంటే ముని లందరూ మెచ్చుకునేవారు. అతను ఒక నోటితో వేదపఠనం చేసేవాడు. మరొక నోటితో సోమ పానం చేసేవాడు. మూడో ముఖంతో ప్రపం చంలో జరుగుతున్నదంతా గమనించేవాడు.

అలాంటి విశ్వరూపుడు పంచాగ్నుల మధ్య తపస్సు చేశాడు. ఒంటికాలి మీదా; చలికాలం నీటిలోనూ, వేసవిలో అగ్నులమధ్యా నిలబడి, నిరాహారుడై తపస్సు చెయ్యటం చూసి, అతను తన పదవి కాజెయ్యటానికి చూస్తున్నాడను కుని, అతని తపస్సు భగ్నంచేయ నిశ్చయించి ఇంద్రుడు అప్సరసలను పంపాడు. అయితే వాళ్ళ శృంగార చేష్టలు వృత్రుడిమీద ఏమాత్రం పనిచేయలేదు. వాళ్ళు ఇంద్రుడి వద్దకు తిరిగి వెళ్ళి, వృత్రుడి తపస్సు చెడగొట్టడం తమ శక్తికి మించిన పని అని చెప్పారు.

ఇంద్రుడు మహాత్ముడైన ఆ విశ్వరూపుణ్ణి చంపటానికి నిశ్చయించాడు. అది ఎటువంటి మహాపాతకమో అతను ఆలోచించలేదు. అతను ఐరావతాన్నెక్కి, విశ్వరూపుడు తపస్స మాధిలో ఉన్న చోటికి వెళ్ళి, ఆయన మీద వజ్రాయుధం ప్రయోగించి చంపాడు.

తన పుత్రుణ్ణి ఇంద్రుడు హత్య చేశాడని విని త్వష్ట ప్రజాపతి మండిపడి, అధర్వణ మంత్రాలతో అగ్నిని అర్చించి వ్రేల్చేసరికి, అగ్నిహోత్రుడికి తీసిపోకుండా ప్రకాశిస్తున్న కొడుకు పుట్టుకొచ్చాడు. అతన్ని చూసి త్వష్ట,

5. వృత్రుడి కథ



''నీ పేరు వృత్రుడు. వేదతత్వం తెలిసిన వాడూ, మూడుతలలు గలవాడూ అయిన మీ అన్నను చంపిన ఇంద్రుణ్ణి హతమార్చ టానికి నువ్వు పుట్టావు. ఆ పని చెయ్యి,'' అని వృత్రుడితో అని, రకరకాల ఆయుధాలు తయారుచేసి ఇచ్చి, రథం కూడా ఇచ్చి, మంచి ముహూర్తాన, బ్రాహ్మణాశీర్వాదాలతో సహా ఇంద్రుణ్ణి చంపటానికి పంపాడు.

దేవేంద్రుణ్ణి హతమార్చటానికి వృత్రుడు వస్తున్నాడని విని, మునులూ, యక్షులూ, దేవతలూ కంగారుగా పారిపోయారు. అలా ఇళ్లూ, వాకిళ్లూ విడిచి పారిపోతున్న దేవత లను చూసి ఇంద్రుడు విచారంతో తన సేవకు లను పిలిచి, ''రుద్రులనూ, ఆదిత్యులనూ, వసువులనూ, దిక్పాలకులనూ విమానాలమీద యుద్ధానికి రమ్మని పిలవండి,'' అన్నాడు.

ఇలా అని, ఇంద్రుడు బృహస్పతిని కూడా తన ఏనుగుమీద ఎక్కించుకుని, యుద్ధానికి తరలాడు. అతని వెనక ఆయుధా లతో సహా దేవతలు కూడా వెళ్ళారు. వృత్రుడు కూడా దానవసేనలను వెంటబెట్టుకుని వచ్చాడు. ఉభయపక్షాలూ మానస సరస్సుకు ఉత్తరాన ఉన్న పర్వతం మీద సంఘటించాయి.

నూరుసంవత్సరాలపాటుయుద్ధం సాగింది. దాని మూలంగా లోకాలన్నీ బాధపడ్డాయి. ముందు వరుణుడు పారిపోయాడు. తరవాత క్రమంగా వాయుగణాలూ, యముడూ, కాంతి నశించిన అగ్నీ నిష్క్రమించారు. ఇంద్రుడు పలాయనం చెయ్యక తప్పలేదు; దేవతలనందరినీ జయించి, వృత్రుడు తండ్రి వద్దకు వెళ్ళి, నమస్కారం చేసి, ''అందరూ ఓడి, భయపడి పారిపోయారు. భయపడ్డ వాళ్ళు అని ఎవరినీ చంపలేదు. ఇంద్రుడు కాలి సత్తువకొద్దీ పరిగెత్తిపోతే, అతని ఏను గును తెచ్చాను. దీన్ని నువ్వు కానుకగా తీసుకో. ఇంకా ఏం చెయ్యాలో చెప్పు, ఎంత కష్టమైనా చేస్తాను,'' అన్నాడు.

త్వష్ట తన కొడుకును చూసి చాలా సంతో షించి, ''నాయనా, నీ పరాక్రమం సాటిలేనిది. మళ్ళీ నలుగురిలో తల ఎత్తుకు తిరగగలను. నా మనోవేదన పోయి, జీవితం ఫలించింది. నాకు స్థిమితం కలిగింది. ఇక నువ్వు చెయ్య వలసిన పని చెబుతాను, విను. ఇంద్రుణ్ణి నమ్మరాదు. అతను చేసే ఇంద్రజాలాన్ని లక్ష్యపెట్టక, బ్రహ్మను గురించి తపస్సుచేసి, చావులేనివాడివై, ఇంద్రుణ్ణి పరిమార్చు. తపస్సుతో సాధించరానిది ఏదీలేదు. ఆ దుర్మార్గుడు అకారణంగా నా కొడుకును చంపాడన్న సంగతి మనసులోనుంచి పోకుండా ఉన్నది. ఆ ఇంద్రుణ్ణిఅంతంచెయ్యి,''అన్నాడు.

వృత్రుడు తండ్రివద్ద సెలవు పుచ్చుకుని, క్రోధావేశంతో గంధమాదన పర్వతం మీదికి వెళ్ళి, గంగలో స్నానాలు చేస్తూ, దర్భచాప మీద ఉండి, అన్నిరకాల ఆహారమూ త్యజించి, యోగం అవలంబించి, మునులకు అద్భుత మనిపించేలాగా బ్రహ్మను గురించి తపస్సు చేశాడు. వృత్రుడి తపస్సుకు బ్రహ్మ సంతోషించి, ప్రత్యక్షమై, "ఇంక నీ తపస్సు చాలించి, నీకు ఏం కావాలో అడుగు," అన్నాడు.

వృత్రుడు బ్రహ్మకు చేతులు జోడించి, "దేవా, ఇదివరకే ఇంద్రపదవి సంపాదించి ఎంతో సంతోషించాను. ఇవాళ నీ దర్శనభాగ్యం లభించటం అంతకంటె ఎంతో ఎక్కువకదా! ధన్యుణ్ణి! నేను కోరిన వరం ఇయ్యదలిస్తే, లోహాలవల్లగాని, కర్రలవల్ల గాని, ఎండిన, ఎండని వెదురు వస్తువులతోగాని, ఇతర ఆయుధాలచేతగాని నాకు చావులేకుండా వరం ఇయ్యి. యుద్ధం సాగినకొద్దీ నా శక్తి పెరిగే టట్టు వరం ఇయ్యి," అన్నాడు.

బ్రహ్మ అతను కోరినవరం ఇచ్చి వెళ్ళి పోయాడు.

వృత్రుడు పరమానందంతో తన తండ్రి వద్దకు తిరిగివెళ్ళి, జరిగినదంతా ఆయనకు చెప్పాడు.

"నాయనా, నీకు శుభం! నీ అన్న విశ్వ రూపుణ్ణి, అకారణంగా చంపి, బ్రహ్మహత్యా పాతకం మెడకు చుట్టుకున్న ఆ ఇంద్రుణ్ణి ఇప్పుడు నిర్భయంగా చంపెయ్యి," అన్నాడు త్వష్ట.

ఇంద్రుణ్ణి నిర్మూలించమని త్వష్ట చెప్పిన మీదట వృత్రుడు రథం ఎక్కి, గొప్ప సేనను వెంటబెట్టుకుని, యుద్ధానికి బయలుదేరాడు.



ఇంద్రుడు మరొకసారి వృత్రుడితో యుద్ధం చెయ్యటానికి సిద్ధపడ్డాడు.

ఇంద్రుడికీ, వృత్రుడికీ గొప్ప యుద్ధం జరిగింది. యుద్ధం చాలా దీర్ఘకాలం సాగిన మీదట ఇంద్రుడు పూర్తిగా ఓడి, దిక్కులేని వాడయ్యాడు. వృత్రుడు అమరావతికి వచ్చి, అక్కడి సకల సంపదలనూ స్వాధీనం చేసుకున్నాడు.

తన కొడుకు స్వర్గానికి రాజు కావటం చూసి త్వష్ట ఎంతో సంతోషించాడు. దేవతలు యజ్ఞభాగాలు పోగొట్టుకుని, చెట్టులూ, పుట్టలూ పట్టి పోయారు. దేవనగరం రాక్షస నగరమయింది.

దేవతలు శివుడికి తమగోడు చెప్పుకున్నారు. "తమ శరణుజొచ్చాం, మమ్మల్ని కాపాడాలి," అన్నారు వాళ్ళు.

శివుడు మామూలు ధోరణిలో దేవతలతో, "మనం బ్రహ్మను వెంటబెట్టుకుని విష్ణువు



వద్దకు పోదాం. అతనే వృత్రుణ్ణి చంపుతాడు,'' అన్నాడు.

అందరూ కలిసి వైకుంఠానికి వెళ్ళారు. విష్ణువు వారికి దర్శనం ఇచ్చి, ''మీరంతా ఇలా వచ్చారు, ఏమిటి విశేషం?'' అని అడిగాడు.

దేవతలు తమ కష్టం చెప్పుకున్నారు. వారితో విష్ణువు ఇలా అన్నాడు:

''అవును, మీకు వచ్చిన కష్టం నాకు తెలుసు. వృత్రుడికీ, ఇంద్రుడికీ స్నేహం కలిగించండి. నేను వజ్రాయుధంలో అదృశ్యంగా ఉండి మీకు సహాయపడతాను. సమస్త కోరికలూ తీర్చగల జగజ్జననిని ప్రార్థించినట్టయితే, ఆమె తన యోగమాయతో సహాయపడుతుంది. ఆమె మాయకు లోబడి వృత్రుడు ఇంద్రుడి చేతిలో చస్తాడు. మీరు కూడా ఆమె సహాయంతో వృత్రుణ్ణి చంపండి.''

దేవతలు కల్పవృక్షాలతో కూడిన మేరు పర్వతం మీదికి వెళ్ళి, మహాదేవిని ధ్యానించారు. వాళ్ళు మహాదేవి తమకు లోగడ సహాయపడి, మహిషాసురుణ్ణీ, శుంభ నిశుంభులనూ, ఇతర రాక్షసులనూ ఎలా చంపినదీ చెప్పి, ''తల్లీ, ఈ వృత్రుడు నీకు కూడా శత్రువే అయి ఉండాలి. లేకపోతే, నీ భక్తులమైన మమ్మల్ని ఇలా ఎందుకు హింసలపాలు చేస్తాడు?'' అన్నారు.

వారి పొగడ్తలకు సంతోషించి దేవి వివిధ ఆభరణాలతో, మూడు కళ్ళతో, నాలుగు చేతులతో, దివ్యమైన ఆయుధాలతో రక్తచందనం రంగుగల వస్త్రాలు ధరించి, వారి ఎదుట ప్రత్యక్షమయింది.

ఆమె వారికి సహాయం చేస్తానని మాట ఇచ్చి అంతర్ధానమయింది. దేవతలు కూడా తృప్తిపడి తిరిగివచ్చి, ఇంద్రుడితో స్నేహానికి ఒప్పించటానికి మునులను వృత్రుడివద్దకు పంపారు.

మునులు వృత్రుడి వద్దకు వెళ్ళి ఇలా అన్నారు:

''వృత్రా! నువ్వు మహాయోగ్యుడవే. ఇంద్రుడు కూడా గొప్పవాడు అనిపించుకున్నవాడే. అలాంటప్పుడు మీరిద్దరూ స్నేహంగా ఉంటే వేరేచెప్పాలా? ఇంద్రుడు నీతో స్నేహ ప్రమాణం చేస్తాడు. నువ్వు కూడా అలాగే చెయ్యి. మునులు మీకు మధ్యవర్తులుగా ఉంటారు.''

దానికి వృత్రుడు, ''మీరంటే నాకు గౌరవమే. మీ మాట తీసివేయలేను. అయితే, పాపాత్ముడూ, బ్రహ్మహంతకుడూ అయిన ఇంద్రుణ్ణి ఎలా నమ్మగలను,'' అన్నాడు.

దానికి మునులు, "ఎవడి ద్రోహం వాణ్ణే కట్టికుడుపుతుంది. ఘోరమైన బ్రహ్మహత్యా పాతకానికీ, కల్లు తాగిన పాపానికీ ప్రాయ శ్చిత్తం ఉన్నది. కాని మిత్రద్రోహానికి ప్రాయ శ్చిత్తం లేదే! అందుచేత నువ్వూ, ఇంద్రుడూ ప్రమాణ పూర్వకంగా స్నేహం చేసుకోవచ్చు," అన్నారు.

"తడిదానితోగాని,పొడిదానితోగాని, రాతితో గాని, కర్రతోగాని, కఠినమైన వజ్రంతోగాని, పగలుగాని, రాత్రిగాని దేవతలూ, వారి అధిపతి అయిన ఇంద్రుడూ నన్ను చంపకూడదు. ఇందుకు అభ్యంతరం లేకపోతే, మీరు కోరి నట్టు ఇంద్రుడితో స్నేహం చేయగలను," అన్నాడు వృత్రుడు.

మునులు ఈ మాట తీసుకుపోయి ఇంద్రుడితో చెబితే అతను సరేనన్నాడు. ఇంద్రుడు వృత్రుడి నియమానికి అగ్నిసాక్షిగా ఒప్పుకున్నానన్నమీదట, ఆ మాట నమ్మి వృత్రుడు ఇంద్రుడితో స్నేహం చేశాడు.

ఇద్దరూ స్నేహంగా కలిసి తిరిగారు. సముద్రతీరానా, నందనవనంలోనూ సంచ రించారు. వృత్రుడు తృప్తిపడ్డాడు. కాని ఇంద్రుడు మాత్రం వృత్రుణ్ణి చంపడానికి సరైన అవకాశం కోసం ఆత్రంగా ఎదురు చూస్తున్నాడు.

ఒకనాటిసంధ్యవేళ ఇంద్రుడూ, వృత్రుడూ సముద్రతీరాన తిరుగుతున్నారు. అది రాత్రీ కాదు, పగలూ కాదు; అంతేగాక వృత్రుడు ఒంటరిగా ఉన్నాడు. అందుచేత ఇంద్రుడు వృత్రుణ్ణిచంపటానికి అదే అదను అనుకుని, విష్ణువును తలచుకున్నాడు. విష్ణువు వచ్చి, అదృశ్యంగా వజ్రాయుధంలో ప్రవేశించాడు. ఇంద్రుడికి సముద్రపు నురుగు కనిపించింది; అది తడిదీకాదు, పొడిదీకాదు; ఏవిధమైన ఆయుధమూ కాదు. ఇంద్రుడు దేవిని కూడా తలచుకున్నాడు.ఆమె తన అంశను ఆ నురు గులో ప్రవేశపెట్టింది. ఇంద్రుడు తన వజ్రాయు ధాన్ని నురుగుతో కప్పి, వృత్రుడిమీద బలంగా విసిరాడు. ఆ దెబ్బతో వృత్రుడు కొండవిరిగిపడి నట్టు పడి, అప్పటికప్పుడు ప్రాణాలువదిలాడు.

శత్రుభయం తీరిపోయిన ఇంద్రుడు ఆనందంగా అమరావతికి తిరిగివచ్చి, మునుల నుంచి స్తోత్రాలు పొందుతూ, మహాదేవికి ఉత్సవం చేయించి, నందనోద్యానంలో రత్న మయమైన ఆలయాన్ని దేవికి కట్టించి, ప్రతిష్ఠించాడు. —(అయిపోయింది)





# ఐకమత్యం

సుకర్ముడు అనే యోగి, తన శిష్యుడు సుహ స్రుడితో కలిసి దేశసంచారం చేస్తున్నాడు. వాళ్ళు ఒక సూర్యాస్తమయం వేళకు, నిరం జనపురం అనే ఊరు చేరుకుని, ఆ రాత్రి అక్కడ గడపదలచి ఒక సత్రానికి వెళ్ళారు.

గురుశిష్యులు సత్రంలో ప్రవేశించేసరికి, లోపలినుంచి ఏదో కలకలం వినిపించింది. ఒక దృఢకాయుడు, పదిహన్నెండేళ్ళ కుర్ర వాణ్ణి ఒడిసి పట్టుకొని, చింతబరికెతో గట్టిగా కొడుతున్నాడు. ఆ దృశ్యం చూసేసరికి గురు శిష్యులిద్దరికీ గగుర్పాటు కలిగింది.

విషయం ఏమిటని ఆరా తీయగా తెలిసిం దేమిటంటే – ఆ కుర్రవాడు ఆనాటివరకూ దృఢకాయుడి ఇంట్లో పనిచేసేవాడు. ఆ ఇంట్లో పనిచేయడం ఒక నరకం అనిపించి, అక్కడినుంచి తప్పించుకుపోదామని చెప్పా పెట్టకుండా బయలుదేరాడు. అయితే, నా అన్నవారు లేనివాడు కావడంతో ఎక్కడికీ పారిపోలేక సత్రంలో ఆ పూట తలదాచు కున్నాడు.

వాణ్ణి వెతుక్కుంటూ బయలుదేరిన దృఢ కాయుడు, తమ ఇంట్లో విలువైన హారం పోయిందనీ, ఆ దొంగతనం వాడే చేశాడనీ, సత్రంలో దొరకపుచ్చుకుని కొడుతున్నాడు. హారం పోవడం అనేది అబద్ధమనీ, తనను తిరిగి పనిలో పెట్టుకుని హింసించాలన్నది దృఢకాయుడి పన్నుగడ అనీ, కుర్రవాడు గగ్గోలుపెడుతున్నాడు.

వాణ్ణి అలా దృఢకాయుడు కొడుతూం డడం, సత్రంలో వున్నవాళ్ళందరికీ బాధ కలి గించసాగింది. కానీ, వాణ్ణి కాపాడుదామని ముందుకు వచ్చి కలుగజేసుకున్నవారు లేరు.

కుర్రవాడు ఆ దెబ్బలకు తాళలేక, ఇంత ఒడ్డూ పొడుగూ మెలికలుతిరిగిన మీసాలతో వున్న గరటయ్య అనేవాణ్ణి, తనను కాపాడ

దాసరి వెంకటరమణ

మని కాళ్ళు పట్టుకున్నాడు. అయితే, గరటయ్య కుర్రవాణ్ణి నిర్లక్ష్యంగా విదిలించేస్తూ, "నాకేం కర్మ! ఈ పని నాది కాదు. వెళ్ళి రక్షకభటులతో చెప్పుకో... పో!" అంటూ అక్కడి నుంచి తప్పుకున్నాడు.

ఇదంతా చూస్తున్న పుల్లయ్య అనే బక్క పలుచటి వ్యక్తికి, ఎక్కడలేని ఉక్రోషం వచ్చింది. అతడు కోపంగా దృఢకాయుడి మీదికిపోయి, "ఏమిటయ్యా, ఈ అన్యాయం! నిజంగా నీ హారం ఏదైనా పోయివుంటే, వాణ్ణి తీసుకుపోయి రక్షకభటులకు అప్పగించు. కానీ, ఇలా పశువులా కొడ్తావా? వాణ్ణి వదులు!" అన్నాడు.

దృఢకాయుడు, పుల్లయ్యకేసి కళ్ళురచేసి చూస్తూ, "ఏరా బక్కవెధవా, బతకాలని లేదా?" అంటూ ఒక్క తోపు తోశాడు. పుల్లయ్య పోయి చుట్టూ వున్న జనం మీద పడ్డాడు.

అయినా, పుల్లయ్య తన పట్టువదలక, కుర్రవాణ్ణి కాపాడమని, అక్కడ వున్నవారిని బ్రతిమాలసాగాడు. ఎవరూ అతడి మాటను పట్టించుకోలేదు.

చివరికి గురుశిష్యుల ప్రోద్బలంతో సత్రం యజమాని కలగజేసుకుని, ఆ వీధి రక్షకభటులను పిలిపించి, దృఢకాయుణ్ణీ, దెబ్బల బాధతో మూలుగుతున్న కుర్రవాణ్ణీ అప్పగించాడు. అప్పటికి బాగా చీకటిపడింది. గురుశిష్యులు రాత్రికి అక్కడేవుండి, మర్నాడు ఉదయమే బయల్దేరారు.

మార్గమధ్యంలో సుహాసుడు, యోగితో, "గురువుగారూ! రాత్రి సత్రంలో జరిగిన సంఘటన నన్ను చాలా కలవరపరుస్తున్నది. రాత్రి సరిగ్గా నిద్రపట్టలేదు. ఒక పర్వతకాయుడు, అంత చిన్నవాణ్ణి చచ్చే దెబ్బలు కొడుతూంటే, అందరూ గుడ్లప్పగించి చూస్తూ



వుండిపోయారు. వాళ్ళది ఎంత భయంకర మైన నైజం!'' అన్నాడు.

దీనికి యోగి కొద్దిసేపు మౌనంగావూరుకుని, ''నువ్వు మొదటిసారిగా చూశావు గనక, అంతగా కలవరపడుతున్నావు. ఏదేని ఒక సందర్భంలో, ఒక సంఘటన ఎదురైనప్పుడు, ఎలా స్పందించాడు, అన్న దానిని బట్టి, ఆ మనిషి వ్యక్తిత్వాన్ని అంచనా వేయవచ్చు. అదేమిటని అడిగితే, ఏ పీడవచ్చి తనను చుట్టుకుంటుందో అని, ప్రతివాడికీ భయం. దీనికి మూలకారణం మనుషుల్లో సంఘీ భావం, ఐకమత్యం లేకపోవడం. ఆ గరట య్యకు, దృఢకాయుణ్ణి ఎదిరించి కుర్రవాణ్ణి కాపాడగలిగే కండబలం వున్నది. కానీ ఆ సంఘటన పట్ల స్పందించే మనసూ, మాన వత్వమూ లేదు. పుల్లయ్యలో మానవత్వం వుంది, కుర్రవాణ్ణి కాపాడాలన్న తపనవుంది; కానీ శక్తి లేదు. అక్కడి పదిమందీ కలిస్తే శక్తి తయారవుతుంది, కానీ కలవరు!'' అన్నాడు.

''ఇందుకు తరుణోపాయం లేదా,గురువు గారూ?''అని అడిగాడు సుహాసుడు.

యోగి చిన్నగా నవ్వి, ''ఎందుకు లేదు నాయనా, వుంది. చెపుతాను విను! వెను కటికి పదిమంది కాశీయాత్రకు వెళుతు న్నారు. దారిలో ముగ్గురు దొంగలు వాళ్ళను అటకాయించి, కత్తులు చూపి బెదిరించి, తమవెంట వాళ్ళను, స్థావరంలో వున్న తమ నాయకుడికి దగ్గరకు తీసుకుపోసాగారు. యాత్రికుల్లో తెలివైనవాడొకడు పరిస్థితి గమనించి, ఒక పాట పాడడం మొదలు పెట్టాడు: మూడు మూళ్ళు తొమ్మిది, మిగి లింది ఒకటి; అని. ఉబుసుపోని పాటే గదా అని, దొంగలు పాడుకోనిచ్చారు. మిగిలిన తొమ్మిదిమంది యాత్రికులు పాటలోని నిగూఢభావాన్ని అర్థం చేసుకుని, ముగ్గు రేసి ఒక జట్టుగా కూడి, ఒక్కొక్క దొంగను ఒడిసి పట్టుకున్నారు. పదోవాడు దొంగల చేతుల్లోని కత్తులు లాక్కుని, అడవి తీగలతో వాళ్ళ కాళ్ళూ, చేతులూ కట్టేశాడు. ఇదే విధంగా మానవత్వమూ, మంచితనమూ గల జ్ఞానులు మనుషుల్లో నిద్రావస్థలో వున్న చైతన్యాన్ని మేల్కొలిపే ప్రయత్నంచేసి, వారికి మార్గ దర్శకులు కావాలి!'' అన్నాడు.

సుహాసుడు, తనకు సందేహ నివృత్తి అయినట్లు మౌనంగా తలవూపి, గురువు వెంట నడవసాగాడు.





# సుందరమ్మ గడుసుతనం

ఒక ఊళ్ళో సుందరమ్మ రామయ్య అనే దంపతు లుండేవారు. వారికి ఒకపెంకుటిల్లు, కొద్దిపాటి పొలం తప్ప ఇతరత్రా ఆస్తులేమీ లేవు. రామయ్య పరమ బద్ధకస్తుడు. కుటుంబాన్ని అంతగా పట్టించుకోడు. సుందరమ్మే తన గడుసుతనం తోనూ, పొదుపుతోనూ సంసారం ఎలాగో నెట్టు కొస్తున్నది.

ఒకసారి వాళ్ళ ఊళ్ళో తిరణాలు వచ్చింది. రామయ్య, భార్యతో, ''తిరణాల దగ్గర పడింది కదా! ఇంటి గోడలూ అవీ బాగా మాసిపో యాయి. తిరణాలకని మన బంధువులెవ రైనా రావచ్చు. చూడ్డానికి బావుండదు కదా. ఈరోజే నలుగురు కూలీలనుపెట్టి ఇంటికి సున్నం కొట్టిద్దాం,'' అన్నాడు.

ఆ మాటలకు సుందరమ్మ ఇంతెత్తు లేస్తూ, ''పందిటి గుంజల్లా ఇద్దరం వున్నాం! చెరొకచెయ్యీ వేస్తే అయిపోయేదానికి, కూలీలెందుకు దండగ ఖర్చు. పైగా వాళ్ళు బోలెడు సున్నం వృథా చేస్తారు కూడా. చుక్క సున్నం నేలపాలు కాకుండా, గోడలకు ఎలా పూయాలో, నాకు బాగా తెలుసు. నువ్వలా వెళ్ళి పక్కింటి చుక్కమ్మనడిగి నిచ్చెన పట్టుకురా. నేనీలోగా సున్నం కలుపుతాను,'' అన్నది.

ఇంటికి సున్నం సంగతి ఎందుకు తెచ్చానా అని రామయ్య, తనను తాను తిట్టుకుంటూ, కండువాను ఒక్కసారి గట్టిగా విదిలించి భుజాన వేసుకుని వీధిన పడ్డాడు. అతడలా తిన్నగా నడుచుకుంటూరెండు వీధుల అవతల వున్న, తనచెల్లెలు కమల ఇంటికి వెళ్ళాడు.

కమల అత్తవారు బాగా వున్నవాళ్ళు. కాక పోతే, కమల కాస్త ఛాయ తక్కువ మనిషి కావడంతో, అత్త ఆమెను, కోడలు నలుపైతే కులమంతా నలుపే, అంటూ లోకువకట్టి చూస్తుండేది. అందువల్ల, అప్పుడప్పుడు అత్తకు, కోడలికీ మధ్య చిన్న చిన్న కీచు లాటలు వస్తూండేవి. అలాంటప్పుడు, కమల అలిగి అన్నగారింటికి రావడం, తర్వాత ఆమె భర్త వచ్చి బ్రతిమలాడి

గవ్వల నిర్మలాదేవి



తీసుకువెళ్ళడం మామూలైపోయిం ది.

రామయ్య కమల వాళ్ళ ఇంటి గడప దాటు తూనే, కమలతో, "మీ వదిన నిన్ను తిరణాలకు నాలుగు రోజులు ముందుగానే పిలుచుకు రమ్మన్నది. అందుకే వచ్చాను. ఆలస్యంచేయక, మీ అత్తతో చెప్పి బయలుదేరు," అన్నాడు.

తన వదినకు అంత మంచిబుద్ధి పుట్టినం దుకు కమల తెగ సంబరపడుతూ, పొలం నుంచి భర్త వచ్చాక, తను అన్నగారింటికి వెళ్ళానని ఆయనతో చెప్పమని, అత్తకు చెప్పి, అప్పటికప్పుడే రామయ్య వెంట బయలుదేరింది.

కొద్ది దూరం నడిచాక రామయ్య కమలతో, "నువ్వు తిన్నగా మనింటికి వెళ్ళు, నాకు బజారునుంచిసరుకులు కొనితెచ్చే పనుంది. పని త్వరగా పూర్తిచేసుకుని నీ వెనకే వస్తాను," అన్నాడు.

కమల సరే అని తలవూపి, రామయ్య ఇంటి కేసి నడిచింది. ఇందులో రామయ్య ఎత్తుగడే మంటే-తన మరదలు కమల ఎదురుగా ఇంటికి సున్నం పూయడం, సుందరమ్మకు నామోషీ అనిపించి, గొప్ప కోసమైనా కూలీ లను మాట్లాడి, ఇంటిసున్నం పని పూర్తిచేస్తుం దని. ఆ విధంగా తను పని తప్పించుకోవచ్చని!

ఈ లోగా సుందరమ్మ, రామయ్య నిచ్చెన కోసం చుక్కమ్మ ఇంటికి వెళ్ళలేదని తెలుసు కుని, అక్కణ్ణించి నిచ్చెన తనే తీసుకొచ్చి "ఈ మనిషి ఎక్కడికి వెళ్ళి వుంటాడబ్బా" అని ఆలోచిస్తూ, తనే గోడలకు సున్నం పూసే పని ప్రారంభించింది.

ఇంతలో కమల, సుందరమ్మ దగ్గరకు వస్తూ, "తిరణాల ఈసారి ఘనంగా ఇక్కడే జరుపుకోమని పిల్చావటగా, వదినా! అన్నయ్య సరుకులూ అవీ తేవడానికి బజారుకు వెళుతూ, సంగతి నాకు చెప్పాడు," అన్నది ఎంతో ఆనందంగా.

కమల మాటలతో సుందరమ్మకు, రామయ్య ఎత్తుగడ తెలిసిపోయింది. ఆమెకు బాగా కోపం వచ్చినా కమలతో నవ్వుతూ, "ఆహా, మంచి సమయాని కొచ్చావు, మరదలా! ఇంటితో బాటు నీకూ ఇంతసున్నం పూసి పంపుతాను. నల్లగా వున్నావంటూ మీ అత్త అదేపనిగా దెప్పుతుంటుందిగదా. ఈ దెబ్బతో ఆమె నోరు మూతపడుతుంది," అన్నది.

వదినె మాటలు వింటూనే కమలకు కోపం వచ్చి, "బావుంది వరస! ముందుగా రావడం, నాదే బుద్ధితక్కువ," అంటూ రయ్యిమని వెనుదిరిగి గబగబా ఇంటిదారి పట్టింది.

సుందరమ్మ ఆమె మాటలు పట్టించుకోకుండా ఓపిగ్గా గోడలకు సున్నం పూయసాగింది.

అల్లంత దూరం నుంచి, కమల విసవిస తన అత్తింటివైపు వెళ్ళుతూండడం గమనించిన రామయ్య హడావిడిగా ఇంటికి వచ్చి, సుందరమ్మను, "కమల కోపంగా వెళుతున్నది; ఏమన్నావేమిటి?" అని అడిగాడు.

అందుకు సుందరమ్మ లేని కోపం నటిస్తూ, "వదినా మరదళ్ళన్నాక వెయ్యిన్నొక్క సరసాలుంటాయి! అయినా మీ చెల్లెలికి ముక్కు మీదుంటుంది కోపం. అలిగి అత్తవారింటికీ- పుట్టింటికీ మధ్య, అసులో కండెలా తిరగడం, ఆమెకలవాటేగదా! తర్వాత వెళ్ళి, ఆమె కోపం తీరుద్దాంగాని, ముందు నిచ్చెనెక్కి సున్నం పని పూర్తి చెయ్యి," అన్నది గడుసుగా.

సున్నం పూయడం తప్పించుకోవడానికి, తను వేసిన ఎత్తు భార్య ముందు పారనందుకు ఉసూరుమంటూ చేసేది లేక కుంచే, సున్నం డబ్బా తీసుకుని నిచ్చెన ఎక్కాడు రామయ్య.




ఇదొక చందమామ కానుక!
అజేయుడు గరుడుడు 11
చిత్రాలు: పోణీ
రాజును అపహరించి బంధించడానికి కుట్ర జరుగుతున్నదని తెలియగానే, ఆదిత్యుడు ఆయన్ను తీసుకుపోయి, రహస్యప్రదేశంలో సురక్షితంగా దాచాడు. రాజూ, ప్రధానమంత్రీ కనిపించకపోయేసరికి, సేనాధిపతి నరేంద్రదేవుడి కొడుకు రవీంద్రదేవుడు అధికారాన్ని చేపట్టాడు. ఆదిత్యుడు మారువేషంలో నగరంలోకి ప్రవేశించాడు.


గుంపుగా గుమిగూడివున్న ప్రజల మధ్య ఆదిత్యుడు ఉండడం సేనాధిపతి గుర్తించాడు.
తననెవరూ గుర్తుపట్ట లేరని అనుకుంటున్నాడు కాబోలు!
ఎవరు నాన్నా? ఆదిత్యుడా?
ఇంకెవరు? నేనే వెళ్ళి స్వాగతం చెబుతాను.


స్వాగతం! మీకేమయిందోనని మేము భయపడి పోయాం. అయినా ఏమిటీ వేషం?
ఏదో ఒకటి జరిగి ఉండాల్సింది. అయినా అది జరగలేదు. అందుకే ఈ వేషంలో రావలసి వచ్చింది.


ప్రియతమ ప్రధానమంత్రికి స్వాగతం!
ప్రధానమంత్రి! వర్ధిల్లాలి!


రవీంద్రదేవుడికి ఇది నచ్చలేదు.
ఆదిత్యా! ఎక్కడికి అదృశ్యమైపోయావు? ప్రధానమంత్రిగా ప్రజలకు వివరణ ఇవ్వవలసిన బాధ్యత నీ మీద ఉన్నది.

మహారాజు అపహరించ
బడ్డాడు! ఆయన ప్రాణానికి
ప్రమాదం కలగవచ్చు!

అతనికి సమాధానం చెప్పకుండా, ఆదిత్యుడు
జనంకేసి తిరిగాడు.

ప్రజలారా! మహారాజుగారు క్షేమంగా
ఉన్నారు! ఒక సంక్షోభాన్ని తప్పించడానికి
ఆయన రాజభవనాన్ని వదలిపెట్టవలసి
వచ్చింది. త్వరలో ఆయన తిరిగి రాగలరు.
ప్రస్తుతానికి మరేమీ చెప్పలేను.
అంతవరకు ఓర్పు వహించండి!

నువ్వొక అబద్ధాలపుట్టవు!
నువ్వూ, గరుడుడూ కలిసే రాజును
అపహరించి ఉంటారు. మీరు
రాజును చంపలేదనడానికి
ఆధారం ఏమిటి?

కొందరు భటులు తనకేసి రావడం ఆదిత్యుడు
గమనించాడు.

కారాగారమే
నువ్వుండడానికి తగిన
స్థలం! భటులారా! వాణ్ణి
పట్టి బంధించండి!

అయితే, నరేంద్రదేవుడు దానికి అడ్డుపడ్డాడు.
అది రవీంద్రదేవుడికి ఆశ్చర్యం కలిగించింది.

ఆదిత్యా! నువ్వు
నీ నివాసభవనానికి
వెళ్ళవచ్చు. రాజుగారి
క్షేమం గురించే నాకు
విచారంగా ఉంది!

కృతజ్ఞతలు! రాజుగారు
క్షేమంగా ఉన్నారు. ఆయన
త్వరలో రాజధానికి తిరిగి
రాగలరు.

మళ్ళీ వాళ్ళేదో
కుట్ర పన్నుతున్నారు.
లేకుంటే నన్నింత తొందరగా
ఎందుకు వదిలి
పెడతారు?


ఈ సంఘటనలను చూడగానే ప్రజలలో కలకలం చెలరేగింది. తమలో తాము ఏదేదో మాట్లాడుకోసాగారు.
మన ప్రధానమంత్రినే వాళ్ళు కాపలాలో ఉంచగలరా?
అవును, మిత్రమా! ఆ తండ్రీకొడుకులు ఎంతకైనా సమర్థులు! ఏమైనా చేయగలరు!
సైనికులు ప్రజలను వెనక్కు తిరిగిపొమ్మని తోశారు.
మన ప్రధానమంత్రికి ఎలాంటి హానీ జరగదు!


రాజభవనానికి చేరగానే, సేనాధిపతి తనకు విశ్వాసపాత్రులైన దళనాయకులను పిలిపించాడు.
ప్రధానమంత్రి అక్కడి నుంచి మరెక్కడికీ కదలకుండా చూసుకోండి. అతన్ని చూడడానికి వచ్చేవాళ్ళమీద కూడా నిఘావేసి ఉంచండి.
చిత్తం, ప్రభూ! ఆయన్ను భవనం నుంచి కదలకుండా చూసుకుంటాం!


తన గదులు దోచుకోబడి ఉండడం ఆదిత్యుడు గమనించాడు. అప్పటికేబాగా అలిసిపోయిఉండడంతో నిద్రకు ఉపక్రమించాడు.


రాజభవనంలో, నరేంద్రదేవుడూ, రవీంద్రదేవుడూ, ఒక మాంత్రికుడి మాటలను ఆసక్తిగా వినసాగారు.
అహా! ఇప్పుడు రాజును చూడగలుగుతున్నాను! ఆయన ఆనందంగా, ఆరోగ్యంగా ఉన్నాడు! మరో ఇద్దరు ఆయన వెంట ఉన్నారు!
... ఒక పురుషుడూ, ఒక స్త్రీ, అహా! ఆ స్థలంచుట్టూ అన్నిరకాల అడవి జంతువులూ తారట్లాడుతున్నాయి. ఒక జల పాతం కూడా ఉందే! మరేదీ స్పష్టంగా కనిపించడం లేదు.




తండ్రీ కొడుకులు ఓర్పు కోల్పోయారు.
దేగా? గరుడుడా?
మరింత దగ్గరగా చూడు! ఇంకా దగ్గరగా!
చూస్తూనే ఉన్నాను. మరేదీ కనిపించడం లేదే! ఆ.... అదిగో.. ఏమిటది? డేగ? ఒక డేగ ఆకాశంలో ప్రదక్షిణం చేస్తోంది!
(ఇంకావుంది)



వ్యాఖ్యలు రాయండి!

# ఫోటో వ్యాఖ్యల పోటీ





ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్టుకార్డుపైన రాసి ఈ నెల 20వ తేదీలోగా మాకు అందేలా పంపాలి.పోటీ ఫలితాలు ఫిబ్రవరి 2002 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ.100 బహుమానం.

ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82,డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ,
ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 097.

## అభినందనలు

అక్టోబర్ 2001 సంచికలో బహుమతి
పొందిన వ్యాఖ్యలు పంపినవారు:
యం.మహేశ్వరరావు
33-6-17, సన్‌రైస్ స్కూల్ దారి
నేరెళ్ళ కోనేరు వీధి, అల్లిపురం
విశాఖపట్నం-530 004 (ఆం.ప్ర)

బహుమతి పొందిన వ్యాఖ్యలు



మొదటి ఫోటో : మురిపించే మురళీగానం!
రెండవ ఫోటో : అలరించే ముద్దుల ప్రాయం!!

చందమామ సంవత్సరచందా:
ఇండియాలో రూ.120లు
Payment in favour of CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 097

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 600 026 on behalf of Chandamama India Limited, No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 097. Editor : Viswam

